

# కపాల కుండల

బంకిం చంద్ర చటర్జి

శ్రీ బంకించంద్ర ఛటర్జీ

(నవల)

# కపాలకుండల

అనువాదం ;

కంభంమెట్టు సత్యనారాయణరావు.

నవభారతీ ప్రచురణ

ప్రకాశకులు :

కె. యస్. ఆర్. & సన్సు

బకింగ్‌హామ్‌పేట P. O. విజయవాడ-2.

# పరిచయం

శ్రీ బంకించంద్ర ఛటర్జీ బంగాళీ భాషలో రచించిన "కపాల కుండల" అను సుప్రసిద్ధ నవల కిది తెలుగు అనువాదము.

చిత్రకథాకల్పనమునందును అద్భుత సన్నివేశముల కూర్పునందును, పాత్ర పోషణమునందును శ్రీ బంకించంద్ర ఛటర్జీ సిద్ధహస్తులు. ఆయన రచించిన నవలలు మన దేశభాషలలోనికేగాక పాశ్చాత్య దేశభాషల లోనికికూడా పరివర్తనము చేయబడినవి.

శ్రీ బంకించంద్ర ఛటర్జీ తమ నవలలందు భారతదేశ మత ధర్మములు, సంస్కృతీ సంప్రదాయములు, ప్రజా జీవనము హృదయాకర్షకముగా చిత్రించి యుండిరి.

ఆనందమఠ్‌లోని యువకులు కులభేదములు విస్మరించి ఐకమత్యముతో మెలగుచు, స్వార్థత్యాగులై స్వధర్మ రక్షణముకొరకు మ్లేచ్ఛ సైన్యములతో పోరాడి దేశోద్ధరణము చేయుదురు. మాతృదేశారాధనయే వారి మతమని, వారు దేశమాతనే మహామాతయగు కాళికాశక్తిగా పూజించిరని శ్రీ బంకించంద్ర ఛటర్జీ చెప్పి, ఆమూర్తిని శత్రుసంహారము చేయు దుర్గగాను, సకల సంపదల నొసగు మహాలక్ష్మిగాను, సకలవిద్యాదాయినియగు సరస్వతిగాను వర్ణించుచు "వందే మాతరమ్" అను స్తుతి గీతము వారిచే పాడించిరి. అదియే మన భారత జాతీయ-గీత మైనది.

కపాలకుండల కథాసందర్భమును పురస్కరించుకొని శ్రీ బంకిం చంద్ర ఛటర్జీ మొగలాయి చక్రవర్తియైన అక్బరు కాలమునాటి భారత దేశ స్థితిగతులను చిత్రించినారు.

మొగలు సామ్రాజ్య రాజధానియైన ఆగ్రానగర వైభవము, రాజకుమారుడైన సలీము (జహాంగీరు) మొదలగువారి ప్రవర్తనము, మొగలాయి నాగరకతయందు మునిగి తేలు స్త్రీ పురుషుల చిత్తవృత్తులు, భారతదేశ ప్రకృతి సౌందర్యము, గ్రామజీవనములోని సుఖ దుఃఖములు మొదలైన సంగతులు కన్నులకు కట్టినట్లు వర్ణింపబడినవి. ఇంతేకాదు; కథానాయకుడొక కాపాలికుని చేతికి చిక్కిన సందర్భమును పురస్కరించుకొని పవిత్రమగు 'శాక్తేయ మతము'నందు, నరబలి మద్య-మాంసముల యుపయోగము మొదలైన ఘోరదురాచారము లెట్లు వచ్చి చేరినవో శ్రీ ఛటర్జీగారు వివరించిరి. శ్రీ కంభంమెట్టు సత్యనారాయణరావుగారీ సుప్రసిద్ధ నవలను చక్కగా అనువదించినారు.

విజయవాడ,
16-9-58
వినాయక చతుర్థి

దిగవల్లి వేంకటశివరావు.

5

# కపాలకుండల

ఆవి మాఘ మాసపు రోజులు. ఆవేళ తెల్లవారు ఝూమున ఒక నావ ఒంటరిగ గంగానదీ సంగమమువైపుగా ప్రయాణ మగుట కానవచ్చినది. ఒంటరిగా ప్రయాణము సాగించుటకు ఆకాలమున నావికులకుగూడ భయముగా నుండె డిది. పోర్చుగీసులు, తదితర శ్వేతజాతులవారు తరచు నావలపై విరివిగా దాడులు జరిపి దోచుకొనుచుండెడివారు. ఆ భయమునుండి విముక్తిబొందుటకుగాను పది పన్నెండు నావల నొక గుంపుగా జేర్చి ప్రయాణము జేయుచుండెడివారు. ఆ రాత్రి బ్రహ్మప్రళయముగా ఉరుములు మెరుపులతో వీచిన తుఫానుగాలికి త్రాళ్ళు తెంచుకుని తమశ్రేణినుండి విడివడి ఈ నౌక దారితప్పి వచ్చినది. ఇంత జరుగుచున్నప్పటికీ నౌకలో ఒక వృద్ధుడు, యువకుడు మినహా యాత్రికులందరు నిద్రాపరవశులై యున్నారు. వారిద్దరుమాత్ర మేదో లోకాభిరామాయణము వల్లెవేయుచున్నారు. ఆ సమయమున అటు నిటు తిరుగుచు నౌకాదళనాయకుడు వారిముందుగా కనుపించెను. వృద్ధు డాతని "నేడు మన మెంతవరకు పోగలము?" అని అడిగినాడు.

"ఇదమిద్ధమని నేనేమియు చెప్పలేను."

నావికుని ఈ జవాబుకు వృద్ధునికి కోపముగలిగినది. వృద్ధుడు నావికుని దూషించ మొదలుపెట్టెను. అదిచూచి యువకుడు "బాబూ! పరమేశ్వరు డొనరించు కార్యముల తీరును పండితులే తెలిసికొనలేరు. అటువంటిది పామరుడగు ఈ నావికుని కేమితెలియును. పాప మితనిపై కోపపడకుడు. శాంతించుట మంచిది." అన్నాడు.

వృద్ధుడు ఉత్తేజితుడై "శాంతించవలెనా? ఔను! పది పదిహేనుపుట్ల ధాన్యపుకుప్ప నూర్చి దొంగలెత్తుకుపోతే చూస్తూ ఊరుకొని సంవత్సరంపొడుగునా భార్యా పిల్లలను ఎట్లా పోషించుకోవాలో నీవే చెప్పు!" అన్నాడు.

ఈవిషయమే యువకుడు నావఎక్కేటప్పుడు ఒడ్డున నున్నవారు చెప్పుకొనుచుండగా విన్నాడు వృద్ధునికిజవాబుగా "ఇంటివద్ద విషయము లన్నియు చూచుకొనువారు వెనుక లేనప్పుడు మీ రిలా యాత్రలకు బయలుదేరటం ఏమంత బాగుండలేదు." అన్నాడు.

వృద్ధుడు పూర్వపు హుందాతోనే "ఇప్పు డిలా రావటం ఏమంత బాగుండలేదంటావ్! ముప్పాతిక జీవితం పైబడ్డాక ఇప్పుడుగాక యింకెప్పుడు యాత్రలుచేయాలి? ఈ వృద్ధాప్యంలోనన్నా నన్ను పరలోకచింత కొంతన్నా చేయవద్దంటావా?"

"తమకు శాస్త్రపరిచయమున్నట్లు లేదు. ఈ యాత్రల వల్ల కలుగు పుణ్యము ఇంటివద్దకూర్చునే సంపాదించుకోవచ్చునుగదా!"

"అది తెలిసినవాడివి నీవేల వచ్చితివి ?"

"నేను మొదటనే చెప్పుకున్నాను. చాలారోజులనుండి సముద్రయానము చేయవలెనని యున్నదని." అని తనలో "అహా ! ఏమి ఈ ప్రకృతి సౌందర్యము ! ఎంత మనోహ్లాద కరముగ నున్నది. ఈ రామణీయకము ఆజన్మాంతము మరపు రానిదిగదా !" అని తన్మయత్వమునుబొంది.,

శ్లో॥ దూరాదయ శ్చక్రనిభస్య తన్వీ
తమాలతాలీ వనరాజి నీలా
ప్రతిభాతి వేలా లవణాంబురాసేః
ధారా నిబద్ధేవ కలంక రేఖా॥

అని అతి మృదువుగా మధురస్వనంతో పాడుకున్నాడు. వృద్ధుని మన స్సికక్కడ లేదు. ఆవైపున నావికు లేదో మాట్లాడు కుంటూంటే మయిమరచి అటే చూస్తున్నాడు.

"ఎంత ప్రయత్నించినా ఎవరికీ తీరము కానుపించుట లేదు. మనప్రయత్నమంతయూ వృధాయగుచున్నది. చివ రకు ఒడ్డు చేరగలమో లేమో ? లేక కానిప్రదేశమున కేదైన చేరుదుమేమో ? ఏదిక్కు తెలియకున్నది." అని వారిలో వా రనుకొనుట వినిపించినది. ఇది విన్న వృద్ధుడు ఏదో విపత్తు రానున్నదని శంకించి, ఒక నావికుని బిలిచి "ఏమి జరిగినది ?" అని ప్రశ్నించాడు. అతనికెవ్వరూ జవా బివ్వలేదు. యువకుడుకూడ యిది విని నావికులు జవాబివ్వ నందున – ఓడ పై భాగమునకుపోయి సూర్యోదయము కాను న్నదని తెలుసుకొనెను. కాని ఆకసమంతటా కాఱమబ్బులు

క్రమ్ముకొనున్నందున - నావ ఎటుబోవుచున్నదీ తెలియక నావికులు చీకాకుబొందుచుండిరని తెలుసుకున్నాడు.

మంచు పడకుండ నావ పైభాగమును తెరచాప గుడ్డతో కప్పియున్నందున బయట జరుగుచున్న ఈ అలజడి లోని యాత్రికుల కేమీ తెలియవచ్చుటలేదు. ప్రస్తుతావస్థ తెలుసుకున్న యువకుడు యావత్తు విషయమునూ వృద్ధునకు విడమర్చి ఆకళింపుజేసెను. అదివిన్న వృద్ధుడు గోల చేయుచూ పెద్దగా అరువ మొదలుపెట్టగా లోని యాత్రికు లెల్లరూ మేల్కాంచి కంగారుపడజొచ్చిరి. స్త్రీలవైపునుండి ఉవ్వెత్తుగా ఆర్తనాదములు బయలుదేరినవి. "నావ ఒడ్డుకు జేర్చండి. నావ ఒడ్డుకు జేర్చండి." అని వృద్ధమహాశయుడు అరువసాగాడు.

నవకుమారుడు (యువకుడు) మృదువుగ నవ్వి "మహాశయా ! ఎక్కడి ఒడ్డు ? అది కనుపించకనేకదా ఈ అవస్థ" అనెను.

ఈతని మాటలు విని నావలోనివారు భీతిల్లి మరింత గోలచేయసాగారు. నవకుమారుడు వారందరిని ఊరడిల్లమని సర్ది చెప్పి సంరంగులతో "మీ రనవసరముగా భయపడు చున్నారు. నేను పైకిబోయి చూచివచ్చితిని. దూరమున సన్నని పక్షులరవములు వినిపించినవి. కొద్ది ఘడియలలో సూర్యోదయము గావచ్చును. గాలికూడ తగ్గుముఖము బట్టినది. నావకేమీ ముప్పము రాదు. ధైర్యముగ నావను తెర చాపలను విప్పి ప్రవాహమువెంట పోనిండు. బాగుగా వెలు

తుడు వచ్చినపిదప అన్నివిషయములు ఆలోచించుకోన వచ్చును." అని హెచ్చరించాడు.

ఈతని ఆలోచనలు నావికులందరకు సమంజసంగా దోచినది. చాలసేపటినుండియు వా రేమియూ తోచక సందిగ్ధావస్థలో పడియున్నారు. యాత్రికులుకూడ ప్రాణములను అరచేతుల బుచ్చుకొని యుండిరి. గాలివీచుట తగ్గినందున అలల కోలాహల మిప్పు డంతలేదు. అయినను యాత్రికులు ప్రాణభయమును యింకనూ వీడకున్నారు. పురుషులు దుర్గామాయిని లోలోన స్మరించుచున్నారు. స్త్రీలుమాత్రము సప్తమస్థాయిలో రోదనము లంకించుకున్నారు. ఆదిలో ఈనావ బయలుదేరునప్పుడు తన చిన్నకుమారుని గంగకర్పించి ఈపణ్మాత్రము ఉద్ధరించ ప్రయత్నించని తల్లి మాత్రము ఏడ్చుటలేదు

ఈవిధముగా ఒకఝాము గడచినది. ఇంతలో "పాంచో - పీరో" అన్న నావికుల కేకలు మిన్నుముట్టినవి. ఓడలోనివారందరూ ఒక్కసారి "ఏమిజరిగినది ! ఏమిజరిగిన!" దని నావికులను ఒత్తిడిచేసిరి. "అడుగో సూర్యభగవానుడు! అల్లదే సముద్రపు టొడ్డు !"అని నావికులు ఉత్సాహముతో హర్ష ధ్వానములు చేసిరి. ఈ కేకలకు లోనివారందరూ ఉత్సాహముతో నావ యేఒడ్డుబట్టినదో చూడ పైకి రాసాగిరి. సూర్యకిరణ స్పర్శతో ఆకాశమున అంతవరకు క్రమ్ముకున్న మబ్బు లెక్కడివక్కడ చెల్లాచెదరై పోయినవి. నావ యున్న ప్రదేశము సముద్రములోని భాగము కాకున్ననూ అది నదీ ముఖమగుటవల్ల, ఆనది అక్కడున్నంత వెడల్పుగా మరె

క్కడనూ లేదు. నావ యిప్పుడు నదీముఖమున చెరిసగమున నున్నది. అందువలన సాధారణులకు ఒడ్డు పోలికైననూ తెలియుటలేదు. ఎటుజూచినా విశాలమైన జలరాశి; అందు అలలపై చంచలముగ ప్రకాశించుచున్న సూర్య కాంతి మనస్సునకు ఆహ్లాదము కలిగించుచున్నది. నావకు తిన్నగ దూరమున అపారమగు జలరాసి నీలవర్ణముతో విరాజిల్లుచున్నది. నావ నదీముఖమున నున్నందున తిన్నగా సముద్ర మగుపడుచున్నది. అందువలన యాత్రికులు మరల ఆపత్తున బడుచుంటిమని తలపోయసాగిరి. కాని కొంతవడికి ముందుకు సాగగా అక్కడ వేరొకనది, ఈ నదీముఖమున కలియుచుండుట కానబడినది. "రసూల్‌పూర్‌నది" యని అందరూ దానిని పిలుచుచుందురని తెలియవచ్చినది. అది కలియుచోట సముద్రపు తూర్పుటొడ్డు కానవచ్చినది. అచ్చట గల యిసుకతిన్నెలపై ఆ సూర్యోదయపు వేళ నానావిధములగు పక్షులెన్నియో క్రీడించుచున్నవి.

## 2

యాత్రికుల హర్షధ్వనులు సన్నగిలి కొంత సద్దుమణగి నది. నావికులు వారితో "సముద్రమున పోటు తగులుట కింకనూ కొంత వ్యవధిగలదు. అంతవరకు ఆ కనబడు ఇసుక తిన్నెపై జేరి వంటజేసికొని భుజించవచ్చును. పోటు ప్రారం భమైన వెంటనే ప్రయాణమై మన తావరమునకు పోవచ్చును"

అని తెల్పిరి. వారి ఆలోచనకు యాత్రికులందరూ దిగి కాల కృత్యములతోబాటు స్నానాదులును నిర్వర్తించుకొనిరి.

వారి సంకల్పమున కొక యాటంకము వచ్చిపడినది. నావలో వంటచెరకు నిండుకున్నది. ఎచ్చటకైన పోయి కట్టెలు ఏరి తెచ్చుకొనవలయును. వన్యమృగముల భయము వలన బయటకుపోయి కట్టెలు తెచ్చుట కెవ్వరునూ సాహసింపరైరి. ఈ స్థితిలో అందరునూ ఉపవాసము లుండవలసినదే. అది చూచి వృద్ధుడు యువకుని పిలచి ''నవకుమార బాబు! నీ వేదైన ఉపాయ మాలోచింపకున్న మనమందరమూ తిండి లేక మాడవలసి వస్తుంది.'' అని అన్నాడు.

నవకుమారుడు కొంతసేపు ఆలోచించినమీదట "సరే నా కేదైన గొడ్డలిగాని, కత్తిగాని యివ్వండి; నేనే వెళ్ళి కట్టెలు కొట్టుకు వస్తాను. కాని అవిమోసుకు రావటం నావల్ల గాదు ఎవరైన ఒకరు మోసుకు వచ్చేందుకు నావెంటరండి" అని చెప్పాడు.

నవకుమారుని వెంట వెళ్ళుట కెవ్వరును అంగీకరించ లేదు. అదిచూచి "భోజనమునకు మాత్ర మందరునూ తయారగుదు"రని విసుగుకుంటూ ఆ యువకుడు నడుము బిగించి గొడ్డలి భుజముపై నిడుకుని కట్టెలు తేబయలుదేరి వెళ్ళిపోయెను.

తీరము పై కెక్కిన నవకుమారునకు కనుచూపుమేర ఎచ్చటనూ మానవసంచార చిహ్నము లేవియూ కనుపించ లేదు. ఎటుచూచిననూ ముళ్ళతుప్పలు, మధ్యమధ్య యిసుక

తిన్నెలు తప్ప కట్టెలుకొట్టి తెచ్చుటకు యోగ్యమైన చెట్లి క్కడా కనుపించలేదు. నదీతీరమువెంట వెదుగుకొనుచూ పోగా చాల దూరమున అతనికొక ఎండుమ్రాకు కనుపించినది. దానినుండి తనకు కావలసిన కట్టెలుకొట్టుకొని, మోపుగా కట్టెను; కాని అదిమోయవలెనన్న అతని కెంతో కష్టమని పించినది.

నవకుమారుడు అయినఇంట పుట్టిన బిడ్డ. యిట్టి కష్ట మైన పనులు జేయుటయం దతని కిదివర కెన్నడూ అనుభవము లేదు. ఈ సంగతి ఆలోచింపకనే కట్టెలు తెచ్చుటకు వప్పం దము జేసుకుని వచ్చినాడు. కాని యివి మోయుటయన్న యింత కష్టపడవలయునని అత డెరుగడు. తాను తలపెట్టిన పనిని మధ్యలో వదలిపెట్టుట అతని స్వభావముకాదు. మోపు భుజముపై కెత్తికొని కొంతదూరము నడచి, అక్కడక్కడ దింపుకొనుచూ అతికష్టముమీద తమవారిని జేర తెచ్చు చుండెను. ఈ కారణమున అతనిరాకకు చాలా ఆలస్యము పట్టుచున్నది. అతనిరాకకై ఎదురుచూచుచున్న యాత్రికులు ఈ ఆలస్యమును పురస్కరించుకుని అతని కేదైన ఆపద కలిగె నేమోననిశంకించుచుండిరి. అతడు రావలసినసమయము చాలా మించిపోవుటవల్ల ఏవన్యమృగమువలననైన అతని కేదైన ఆపద కలిగెనేమోనని ఊహించువారేగాని, ఒడ్డునకెక్కి చూడ సాహసించినవారు అందరిలో ఒక్కడైననూ లేకపోయిరి.

ఈ సమయమున భయంకరమైన కల్లోలము సము ద్రమున బయలుదేరినది. పోటుప్రారంభమయినదని నావికులు తొందరపడసాగిరి. బ్రహ్మాండమంత తరంగములు లేచి ఒడ్డును

డీకొనుచున్నవి. ఆసమయమున అచట నావలుండుటతటస్థించిన ప్రవాహవేగమున ఒడ్డునకు విసరికొట్టుటవల్ల ముక్కముక్కలుగా నాశనమైపోవుట తప్పదనియు వారెరుంగుదురు. అందువలన నావను నదీ మధ్య ప్రవాహమువరకు తోసికొనిపోవ యత్నించుచుండిరి. ఇంతలో ఈ కల్లోలమువల్ల కలిగిన తరంగములు యాత్రికులు వంటజేసుకొనునుద్దేశ్యముతో జేరిన యిసుకతిన్నెను పూర్తిగా నీటతడిపి వారి వంట సామాగినంతయూ నష్టపరచినది. యాత్రికులు మాత్రము త్వరితగతిని నావను జేరగలిగిరి. ఆటుపోటులవలన గలిగిన ప్రవాహవేగమునకు నావ "రసూల్‌పూర్" నదీ ప్రవాహమున కొట్టుకొని పోవుచున్నది. నావికు లంత నేర్పరులుగారు. వారు నావ నాపలేకున్నారు. ఇంతలో లోనివా రెవరో "నవకుమారుడు తిరిగి వచ్చినాడా!" అని అడిగిరి. ఇంకెక్కడి నవకుమారబాబు! ఏ క్రూరమృగమో ఆ బాబును మింగివేసియుండును. కానిచో ఎప్పుడో రావలసినవాడు ఇప్పటివరకూ రాకయుండునా!" అని ఒక నావికుడు జవాబిచ్చెను.

నావ విచ్చలవిడిగా మహావేగముతో ప్రవాహమున పోవుచున్నది. ఎంత ప్రయత్నించిననూ దానిని మళ్ళించ నావికులకు శక్యముకాలేదు. ఆ చలిరోజులలో కూడ వారికి శరీరమంతయూ ముచ్చెమటలు పోయుచున్నవి. ఇట్లెంత సేపో ప్రయత్నించిగాని, వారు నావను త్రిప్పలేకపోయిరి. కాని వెంటనే అది వెనుదిరిగి వెనుకటికంటె ద్విగుణీకృత వేగముతో ఉత్తరాభిముఖముగా బోజొచ్చెను. దాని నాపుట కెవ్వరికినీ అలవికాలేదు.

నావ రసూల్‌పూర్ రేవుదాటి చాలా దూరము వరకూ పోయినది. అప్పటి ప్రవాహవేగము చాలవరకు తగ్గినది. అచట నావను ఆప నావికులకు సులువైనది. యాత్రికులలో మరల నవకుమారునిగూర్చి ఆలోచన బయలుదేరినది. అతనికొరకు మరల నావను వెనుకకు పట్టించవలెనా? అక్కరలేదా? అన్నమీమాంసపై తీవ్రముగ తర్జన భర్జనలు జరిగినవి. వారిలో అతని బంధువు లెవ్వరునూలేరు. "మరల వెనుకకు బోవుట వెర్రితనము. ఆ స్థానము చేరునప్పటికే చీకటి పడును. మరల మనము వెనుకకు వచ్చుటకు తెల్లవారిపోటు ప్రారంభమగువరకు ఉండవలయును. ఇట్టియెడ నిన్నటి వలెనే ఈనాడుకూడ మనము తిండికి మాడవలయును. మన సంగతి ఎట్లున్నను నావికులు మాత్రము యిందుకు సమ్మతింపరు. వారు మన మాట విని నావను మళ్ళింపరు. నవకుమారబాబు ఏమృగము వాతనోబడి చనిపోయియే యుండునని వారిదివరకే నిర్ణయించి చెప్పిరి. అదియే నిజమై యుండవచ్చును. ఈ నమ్మకముతో ఉన్న నావికులు వృధగా మన మాటలు విని శ్రమపడరు. మనముకూడ ఈ సంగతి తెలిసికూడ ఎందుకు శ్రమపడవలయును" అని యాత్రికులలో చాలామంది తమ యభిప్రాయమును వెల్లడించిరి.

ఏక కంఠమున ఇంతమంది యాత్రికులు తమ అసమ్మతిని తెలుపుటవలన వెనుదిరిగిపోయి నవకుమారుని వెదకుటకు ప్రయత్నముచేయ మానుకొనిరి భయంకరమైన అటవీ ప్రదేశమున, యువకుడు – ఆత్మోపకారియు నగు నవకుమారుడు వన్యమృగముల వాతబడునని యైన జాలిచూపక,

పశుప్రాయులుగ ప్రవర్తించిన యాత్రికులు తమ స్వగ్రామము లకు పోవలయుననియే నిశ్చయించుకొనిరి.

# 3

ఏ ప్రదేశమున నవకుమారుని అతని కర్మమునకు వదలి యాత్రికులందరూ వెడలివచ్చిరో అచట ఆరోజులలో ఎక్కడనూ జననివాసయోగ్యమగు ప్రదేశములు లేవు. కాని "దౌలత్ పూర్, దరియాపూర్" అను రెండు చిన్న గ్రామములిప్పుడక్కడ వెలసినవి. అయిననూ ఆ ప్రాంతములన్నియూ వంగదేశమందలి యితరప్రదేశములవలె సేద్యయోగ్యములు గాక అరణ్యమయమై బేచిరాకుగా యున్నవి. రసూల్ పూర్ నుండి సువర్ణరేఖవరకు ఎన్నియోమైళ్ళదూరము పొడుగున పెద్దపెద్ద యిసుక గుట్టలు పర్వతశ్రేణివలె వ్యాపించియున్నవి. ఈ యిసుకతిన్నెల శిఖరాగ్రములపై ప్రచండ సూర్యకిరణ కాంతి ప్రసరించినపుడు అపూర్వ శోభను గొలుపుచుండెడివి. వీనిపై వృక్షజాతులేవియూ పెరిగియుండలేదు. పాదములందు మాత్రము ముండ్లపొదలు, చిన్నచిన్న అటవీ పుష్పజాతులేవో దట్టముగా పెరిగి యుండెను.

అట్టి నిర్మానుష్యమైన, భయంకర వన్యప్రదేశమున పశుప్రాయులగు యాత్రికులు నవకుమారుని విడిచిపుచ్చి వెళ్లిపోయిరి. అతి కష్టముతో ఎట్టకేల కతడు కట్టెలమోపు మోసికొనివచ్చి చూడ అతనికి తనవారుగాని, తమ నావగాని కనుపించలేదు. ఆకస్మికముగ అతనికి భయముకలిగెను.

తోటియాత్రికులు తన్నిట్లు ఒంటరిగ విడచి వెళ్లుదురని ముం దతడు ఊహించియుండలేదు.

సముద్రపుపోటు తగిలి యిదివరకు తమవా రుండిన యిసుకతిన్నె మునిగిపోవుటవల్ల నావతో వేరొకచోటికి పోయి సురక్షితముగ నున్నారనియు, మరల వచ్చి తన్ను కలుసుకొనగలరనియు, అక్కడనే వారికై వేచియుండెను. కాని ఎంతసేపటికిని వారిజాడ కానరాలేదు. ఆకలిబాధ మెండగుచున్నది. వారి రాకకై నిరీక్షించుటవలన ప్రయో జన ముండదని, నదీతీరమువెంట వెదకుచూ బోయెను. అల్లెంతదూరము పోయిననూ వారు కనుపించలేదు తిరిగి వెనుకటి ఆ యిసుకతిన్నెనద్దకు వచ్చి చేరెను. ఎంతసేపటి కినీ నావ కనుపించనందున అది ప్రవాహవేగమున కొట్టుకొని పోయియుండునని నిశ్చయించుకొనెను. ప్రవాహవేగమువలన నావను మళ్ళించి నడుపుటకు నావికులకు శక్యము గాకపోయి యుండునని తలచెను. కాని యిదివరకే పోటు వడి తగ్గిపోయి నది. సూర్యాస్థమయము కూడ నయినది. ఈ పాటికి నావ వచ్చి యుండవలసినది.

ఒకవేళ సముద్ర కల్లోలములో నావ మునిగిపోయి యుండవచ్చును. లేనిచో, క్రూర మృగముల వాత బడమని తోటి యాత్రికులు తన్నిట్లు ఒంటరిగ విడచి వెళ్ళరని తలపోయజొచ్చెను.

ఒక్కసారి నలుదిక్కుల కలయజూచెను. గాని ఎచ్చ టనూ గ్రామీణులుగాని గ్రామముగాని కనుపించలేదు. ఆశ్ర

యముగాని ఆహారముగాని దొరకునాసయంతకంటెకలుగలేదు. నదిలోని నీరు సముద్రుని స్పర్శవలన ఉప్పనై త్రాగ యోగ్యముగలేదు ఆకలి దప్పులవలన నతనికి బాధ మిక్కుటమగుచుండెను. అంతకంతకు చలిగాలి తీవ్రముగ వీచుచున్నది. దానికితోడు మంచుకూడ పడుచున్నది. చివరకు తలదాచుకొనుట కతనికి ఏ ఆశ్రయముకూడ లభ్యముకాలేదు. తుదకు అచటనే నేలపై పరుండి "ఈ కాళరాత్రి వ్యాఘ్ర భల్లూకాది ఏ వన్య మృగములైన యిటురావచ్చు, అట్టిచో నాకు మరణము తప్పదు." అని చింతింపసాగెను.

మనస్సు స్థిమితముగాలేనందున నవకుమారుడు ఒక్కచోట నిలకడగా కూర్చుండలేక పోయెను. కొంతసేపటికి నదీతీరముపైకి పోయి అటూ నిటు తిరుగసాగెను. తుదకు సూర్యాస్తమయమయి నలుదిశల చీకటికూడ వ్యాపించినది. ఆకసమున మిణుకు మిణుకు మనుచు నక్షత్రములుకూడ పొడజూపినవి. ఎటుచూచిననూ అతని కేమియూ కనుపించుట లేదు. అంతటనూ నిశ్శబ్దముగా యున్నది. కాని అప్పుడప్పుడు కల్లోలితమైన సముద్రగర్భజనితార్భాటములును, అటవీ మృగ గర్జనములును వినవచ్చుచుండెను. అయిననూ అతడా భీషణాంధకారనిశ్శబ్దతలో మనశ్చాంచల్యమువలన ఒక్కొక్కప్పుడు ఇసుక తిప్పల పై భాగముననూ, వేరొకప్పుడా యిసుక కొండల సమీపప్రదేశమున తిరుగుచుండెను. అట్లాతడు తిగుగుచున్నంతసేపూ ఏవో మృగములు తనపైకి వచ్చుచున్నట్లే భయపడుచుండెను. తుదకు స్థిరముగా నొకచోట కూర్చున్ననూ అతని కా భయము తీరలేదు.

రోజంతయూ తిండిలేక మిక్కుటముగా తిరుగుటవలన నవకుమారుడు పూర్తిగా అలసిపోయెను. తుద కొక యిసుక తిన్నెపై మేనువాల్చెను. ఆ సమయమున తనయింటివద్ద మెత్తని శయ్య జ్ఞాపకమునకు వచ్చెను. శారీరిక అలసటకు తోడు మానసిక విచారము మెండుగాయున్నను అప్పుడప్పుడు కించిత్తు నిద్రబోవుట మానవ స్వభావము. మేనువాల్చిన నవకుమారుని కొకింత నిద్రబట్టినది. నిజముగా ప్రకృతియందిట్టి నియమమే (నిద్ర) ఏర్పాటుగాకయున్నచో కేవలము సంసారచింతలవల్లనే మానవులు మృత్యుముఖమున బడుచుండెడివారు.

# 4

భయంకరమగు కాళరాత్రి మధ్యమున నవకుమారునకు మెళుకువ వచ్చినది.

అప్పటివరకు తన్నెవన్యమృగములు కబళించకుండ ఉంచినందుకు తనకే ఆశ్చర్యము కలిగినది. ఏదైన క్రూర మృగము తనవైపు వచ్చుచున్నదేమోనని నలువైపులా పారజూచెను. అకస్మాత్తుగా చాలాదూరములో అతని కొక వెలుగు గనుపించెను. అది అతని భ్రమ ఏమోననుకున్నాడు. అది నిశ్చయించుకొనుటకై ఆవైపే తీవ్రముగా చూడసాగాడు. ఆవెలుగు క్రమక్రమముగా వృద్ధియై ఉజ్వలముగ ప్రకాశించుచున్నది. అది ఎవ్వరైన వేసిన "నెగడు" గావచ్చునని తలపోసినాడు. అంతలో అతనిమనస్సున జీవితాశ పొడచూపినది.

మనుష్య సంచారమనునదిలేక ఈప్రకారము మంట కనుపించుటకు సావకాశముండదు అని తలపోయుచు నవకుమారుడు వెలుగు కనపడువైపుకు, సూటిగా పరుగిడ మొదలుపెట్టెను. అతని మనమున అది యేకొరవిదయ్యమైననూ కావచ్చునను అనుమానము పొడచూపకపోలేదు. యేదిమైననూ ముందు ప్రాణము రక్షించుకొనవలయునను లక్ష్యముతో ధైర్యముచేసి ముందునకు సాగిపోయెను.

నవకుమారుడు అడుగడుగున తనదారి కడ్డు తగులు, కొండలవలె వరుసగానున్న ఇసుకరాసులు ఎక్కి-దిగుచూ, ముండ్ల పొదలను దాటుచు — అడవి లతలను త్రెంచి తప్పించుకొనుచూ తన గమ్యస్థానమును జేరబోవుచుండెను. మిక్కటమగు శ్రమకోర్చి అత డా వెలుగున్న యెడ సమీపించి చూడ ఎత్తైన ఇసుక స్థూపము పైభాగమున మండుచున్న నెగడు-దానిముం దొక మనుష్యమూర్తి కూర్చుండియుండుట చూచెను. ఆతని సమీపించ నెంచి స్థూప మధిరోహించ మొదలుపెట్టు నంతలో అతని మనమున నేదో అనుమాన ముద్భవించినది. అది లెక్కచేయక ఆ ఇసుకకొండ నధిరోహించి ఆ మానవమూర్తి చెంత కరిగి చూడగనే అతనికి శరీరము పులకరించినది. ఆ మానవమూర్తి కనులు మూసుకుని సమాధియందుండెను. అచటనుండుటయా లేక వచ్చినదారినే తిరిగి పోవుటయా యను సందిగ్ధావస్థలో పడెను. నవకుమారుడు మొదట ఆతనిగూర్చి యోచించలేదు గాని ఆయన వయస్సు యేబదికి పైబడినదని నిర్ణయించుకున్నాడు. అతని కటి ప్రదేశమున నేదేని

వస్త్రమున్నదీ లేనిదీ తెలియుటలేదుగాని నడుమునుండి మోకాలివరకు పులిచర్మముచే కప్పబడియున్నది. పొడుగాటి గడ్డము, మీసములు, తలపై జడలుగట్టిన జుట్టు, మెడను రుద్రాక్షమాలికలు గలిగియుండెను. ముందు నెగడు మండు చున్నది. ఆమంటను చూచియే నవకుమారుడు యిక్కడకు రాగలిగినది. అతని కచ్చటకు రాగనే ఏదో దుర్వాసన గొట్ట సాగినది. ఆతని ఆసనమువైపు పరీక్షగ చూడగనే దుర్గంధ కారణము నవకుమారునికి తెలియవచ్చినది. ఆ జటాధారి ఒక మొండెముపై ఆసీనుడై యుండెను. నెగడుకు ముందు కొన్ని నరకపాలములును - వాటిలో కొన్నిటియం దేదో ఎర్రని పదార్థమును కానవచ్చినది. అదిచూచిన యువకునికి భయము కలిగినది. అచట నలుమూలల ఎముకలు కనుబడు టయేగాక తుద కా యోగి ధరించిన రుద్రాక్షమాలికయందు కూడ అక్కడక్కడ చిన్నచిన్న ఎముకముక్కలు కట్టబడి యున్నవి. ఇదిచూడ నవకుమారునికి ఆశ్చర్యమయ్యెను. అట నిలువబడుటకుగాని వెనుదిరిగి పోవుటకుగాని ఆతనికి ఆలో చనతోచుటలేదు. ఇదివరకు ఎప్పుడో అతడు విన్న "కాపాలి కు"ల సంగతి యిప్పుడు జ్ఞప్తికివచ్చి యితడుకూడ అట్టి భయంకర కాపాలికుడేనని నిర్ణయించుకొనెను.

కాపాలికుడు మంత్రసాధనయందు నిమగ్నుడై యుండెను. చాలసేపటివరకు నవకుమారు నాతడు చూచి యుండలేదు. కళ్లు తెరచిన తరువాత చూచియూ కొంత సేపటివరకు ఊరకుండి తరువాత "కస్త్వమ్" అని సంస్కృత భాషలో అడిగెను.

"నేను బ్రాహ్మణుడను." అని నవకుమారుడు చెప్పెను.

"తిష్ఠ" అని కాపాలికుడు మరల ధ్యానమునందు నిమగ్నుడయ్యెను. అట్లు నాలుగైదు గడియలు గడచువరకు నవకుమారు డక్కడనే యున్నాడు. అప్పటికి కాపాలికుడు తన సాధనమును ముగించుకుని లేచి నిలువబడి—వెనుకటివలెనే గంభీరస్వరముతో "నావెంట రమ్ము!" అని ఆజ్ఞాపించెను.

ఇంకొక సమయమైనచో నవకుమారు డట్టి కాపాలికుని వెంట జనియుండెడివాడు కాడు. కాని మిక్కుటముగా ఆకలితో బాధపడుచుండుటవలన "చిత్తము. నేనాకలివలన మిక్కిలి బాధపడుచున్నాను. నే నక్కడకుపోయిన ఆహార పానీయములు దొరకునా ? ముందు శెలవిండు."

"నీవు భైరవీ ప్రేరితుడవై వచ్చినవాడవు. నావెంట రమ్ము; అన్నపానాదులు దొరుకగలవు." అని కాపాలికుడు అన్నాడు.

నవకుమారుడు కాపాలికుని వెంట బయలుదేరెను. అట్లు వారు చాలాదూరమువరకు నడచిపోయిరి. త్రోవలో ఎవరునూ మాట్లాడలేదు. వారు కొంతసేపటికొక కుటీరము వద్దకు జేరిరి. ముందుగా కాపాలికు డా కుటీరమున ప్రవేసించి, తరువాత నవకుమారుని లోనికి రా నాజ్ఞాపించెను. లోనగల దివ్వె నొకదానిని వెలిగించి జలకలశమును, కొన్నిఫలములను, పరుండుటకొక వ్యాఘ్రచర్మమును చూపి, "ఈ ఫలములను భుజింపుము, ఈ దొన్నెయందు కలశములోగల నీటినిపోసుకొని త్రాగవచ్చును. ఈ వ్యాఘ్రచర్మమును చూచి భయపడ వలదు. దీనిమీద పరుండుము. ఇచటకు పులులు మొదలగు

క్రూరమృగములేవియూ రావు. నేను ప్రరల త్వరలోనే వత్తును. అంతవరకు నీవీ కుటీరమువదలి ఎచటికిని పోవలదు" అని కాపాలికుడు ఎందేని వెడలిపోయెను.

నవకుమారు డా ఫలములను భుజించి, కలశోదకమును కొంచెముప్పగానున్ననూ త్రావి శమితక్షుధా ర్తుడయ్యెను. పవలంతయూ తిండిలేక మిక్కుటముగా శ్రమపడియుండెనేమో, ఆ వ్యాఘ్రచర్మముపై పరుండిన వెంటనే నిద్రపట్టినది.

## ౫

సూర్యోదయపువేళ నవకుమారుడు మేల్కాంచి, కుటీరమునుండి బయటపడి స్వగ్రామమునకు పోవుటకై ఉపాయమాలోచింపసాగెను. మీదుమిక్కిలి ఆ కాపాలికుని చెంత నుండుట అతని కంతమంచిదికాదని మనస్సునకు దోచినది. "ముందు ఇక్కడనుండి బయటపడి అరణ్యము ఎట్లు దాటవలయును? తదుపరి ఏ విధముగా యిల్లుచేరవలయును? ఇక్కడి ప్రదేశములన్నియు కాపాలికునకు తెలియును. ఆయనను తెల్పుమని కోరిన చెప్పునో, చెప్పడో! ఏది ఎట్లున్ననూ కాపాలికుడు అనుమానించుటకు వీలుండునట్లుగా ప్రవర్తించలేదు. అట్టియెడ నే నెందుకు భయపడవలయును. కాపాలికుడు మరలివచ్చువరకునూ నన్నుకుటీరమునుండి వెడలిపోరాదని శాసించినాడు. అట్లు చేయకున్న నాపై అతనికి కోపము కలుగును. కాపాలికులు మంత్రబలముతో ఎట్టిపనినైననూ చేయగలరని చెప్పుకుందురు." అని తన మనమున తలపోయుచూ నవకుమారుడు కాపాలికుని ఆజ్ఞ నుల్లంఘించు టంత

శ్రేయస్కరము కాదని ఎంచి అక్కడ నుంటకే నిశ్చయించుకొనెను.

మిట్టమధ్యాహ్న మైనప్పటికీ, కాపాలికుడు తిరిగి రాలేదు క్రితమురోజు ఉపవాస మున్నందునను, ఆ రోజంతవరకు నేమియు భుజించకున్నందునను అతని కాకలిబాధ మిక్కుటముగా నుండెను. "కుటీరములోనున్న కొద్ది ఫలములు రాత్రి భుజించుటకే చాలినవికావు బయటకుపోయి ఎందైన ఫలములు వెదకి తెచ్చుకొనకున్న ఈ ఆకలిబాధ కోర్వలేక ప్రాణములు విడువవలసివచ్చును." అని మదిలో తలపోసి ఫలాన్వేషణమునకై కుటీరమునుండి బయలువెడలెను.

ఫల వృక్షములకొరకు వెదకుచు నతడు వరుసగా కొండలవలెనున్న యిసుకతిన్నెలనుదాటి చాలదూరమున గల వృక్షములనుండి కొన్ని ఫలములను సేకరించి తినుచూ తన ఆకలిని తీర్చుకొనెను. అటనుండి ముందున్న సమున్నత ప్రదేశమునగల యరణ్యమున యేదైన త్రోవ దొరకునను నాశతో ప్రవేశించి పోవ మొదలుపెట్టెను. అతని ఆశ ఫలించుట కెంతసేపో పట్టలేదు. అతడు తలంచిన విధముగనే యేదో యొక త్రోవ దొరికినది. ఆత్రోవవెంట బోవుచూ మనస్సులో కాపాలికాశ్రమమునకు ఏ దిక్కుగా పోవుచున్నదియు తెలియక ఆలోచించుచుండెను. ఇంతలో అతనికి సమీపమునుండి సముద్రపు హోరు వినవచ్చినది. అటులనే ఆ త్రోవను మరికొంత ముందుకు పోగా అరణ్యము దాటి పోయి సముద్రపుటొడ్డు చేరగలిగెను ఎదుట అనంతసాగర నీలజలరాశిపై అలలవలన గలిగెడి నురగలు – పుష్పమాలల

వలె కనుపట్టు అతని మన స్సానందమున ఉప్పొంగినది. అస్తమించుచున్న సూర్యుని కిరణకాంతులు నీటిపై ప్రతిబింబించి బంగారుచాయ కల్పించుచుండెను. ఆవేళ సముద్రపు లోతట్టున చాలదూరమున శ్వేతముఖుల వర్తక నౌక యొకటి తెరచాపలెత్తబడి వాయువేగమున పోవుచుండెను.

నవకుమారుడు అట్లెంతకాల మక్కడ కూర్చుండి యచటి ప్రకృతిని జూచి యానందించుచుండెనో తెలియదు. సముద్ర జలరాసిపై నీరెండ ప్రసరించుట జూచి దీర్ఘముగ నిట్టూర్చి, కాపాలికాశ్రమమునకు బోవలయునని లేచెను. ఎందుకటుల నిట్టూర్చెనో చెప్పుట కష్టము. బహుశః లోగడ తా ననుభవించిన ఏ సుఖములైన తలపునకు వచ్చి యుండవచ్చును. అట్లు లేచి వెనుతిరుగగనే అతని కొక్కింత దూరములో ఒక అపూర్వతరుణీమూర్తి నిలువబడియుండుట కానవచ్చినది. సైకత భూభాగమున ఆ సంధ్యవేళ అట్లు నిలువబడిన ఆమె కేశములు మోకాళ్ల క్రిందివరకూ పొడవుగా వ్రేలాడుచుండెను. శిరోజములకు ముందుభాగమున ఆమె శరీరము సౌందర్యమున దాగులాడుచుండెను. ముంగురులు వత్తుగా క్రమ్మియుండుటవల్ల ముఖము పూర్తిగా గనుపించుటలేదు. అయినప్పటికీ మేఘావృతుడైన చంద్రుడు వాటిని చిందరవందర జేసి ప్రకాశించున ట్లామెముఖ కాంతి ఆ ముంగురుల లోతట్టునుండియే ప్రకాశించుచున్నది. ప్రకాశవంతములైన ఆమె విశాలనేత్రములనుండి వెలువడు చూడ్కులు స్థిరములు, గంభీరములు నైయుండియు, చంద్ర కిరణములవలె స్నిగ్ధముగను, మధురముగను యుండెను. ఆమె

మేనిచాయ బంగారుచాయ నధిగమించుచున్నది. నిరాభరణ యయ్యు, ఆమె మోహినీమూర్తి యనుట కెట్టిసందియమును లేదు.

అకస్మాత్తుగా యిట్టి దుర్గమారణ్య ప్రాంతమందు ఆ సుందరమూర్తిని జూచి నవకుమారుడు ఆశ్చర్యచకితుడాయెను. అతని నోటివెంట మాట వెగలుటలేదు కేవలము ఏకాగ్ర చిత్తముతో ఆమె సోయగమును వీక్షించుచుండెను. అతని చూపులయందు ఒకింత ఆకాంక్ష వ్యక్తమగుచున్నది. ఆమె పరిస్థితికూడ నట్టులే యున్నది.

అట్లా సముద్రతీరమున ఏకాంతమందు వారు చాల సేపటివరకు ఒకరి నొకరు విలోకించుకొనుచు మాటలాడకుండ ఉండిపోయిరి. తుదకు ముందా స్త్రీమూర్తియే మృదుమధుర స్వరమున "పథికుడా! దారి మరచి వచ్చితివా?" యని పలుకరించినది.

ఆమె పలుకులా నవకుమారుని మనమున చైతన్యమును గలిగించెను. అతని మనమున నేవియో తెలియరాని యూహలు పొడచూపినవి. ఏదియో క్రొత్త యనుభూతి మనమున కలకవేయసాగినది. యింతలో "పథికుడా! దారి తప్పితివా?" యన్నమాటలు చెవికి సోకినవి. అప్పటికి అత డున్న స్థితిలో ఆమె కేమిజవాబివ్వవలయునో తోచలేదు. తమచుట్టునూగల ప్రకృతియంతయు సుందరముగా నున్నది. ఆమెయూ సుందరి; ఆమె పలుకులును సుందరములుగా నుండెను. తన మనో సౌందర్యమున వీటిని లీనపరచి శ్రుతికలిపి ఆత డేదియో యానందము బొందుచుండెను.

అత డేదియూ జవాబివ్వకుండుట చూచి, ఆమెయే "నావెంట రమ్ము" అని దారిచూప బయలుదేరెను. చల్లని వేళ మందపవనుని తాకిడికి, ఆకసమున శుభ్రావృతమైన తెర మబ్బులు సంచరించు మాడ్కి ఆమె పదవిన్యాసము చేయుచూ నడచుచుండెను. భూమిపై ఆమె పదములజాడ ఎక్కడనూ కనుపించుటలేదు. నవకుమారు డేమియూ మాట్లాడకుండ తలవంచుకుని ఆమె ననుసరించి పోవుచుండెను. అట్లు వారు కొంత దూరముపోయి ఒక చిన్న అడవిని ప్రవేశించిరి. ఆ చిట్టడవిని దాటి చూడ అతని కాజవ్వని మరి కనుపించ లేదు. ఎదుట అల్లంత దూరమున తా విడిచి వచ్చిన కుటీర మగుపించినది.

## 6

నవకుమారుడు కుటీరము ప్రవేశించి తలుపుమూసి రెండుచేతులతో తల పట్టుకుని అక్కడనే దర్వాజానానుకుని చాలసేపటివరకు తల పైకెత్తకుండగనే కూర్చునిపోయెను.

"ఈమె ఎవరు? మానిసియా? దేవతయా, లేక కాపాలికునిచే నియుక్తయగు మాయావినియా!" అని తాను జూచిన యువతినిగూర్చి పరిపరివిధముల ఆలోచింపసాగెను. కాని అత డేనిశ్చయమునకు రాలేకపోయెను. ఆలోచనా చిత్తుడగుటచేత అతని మన స్సేవిషయము మీదకు పోవుట లేదు. అతడు కుటీరములో ప్రవేశించుటకు పూర్వమేకుటీర మందు కట్టెలతో సన్నని మంట చేయబడియున్నది. అట్లు మైమరచియున్న అతనికి సాయంసంధ్య గడచి నిశిరాత్రి యగువరకు తాను సాయంకృత్యములు నిర్వర్తించుకొన

లేదన్న సంగతి జ్ఞప్తికిరాలేదు. అప్పటికతడు తలఎత్తి చూడ తా నిదివరకు చూచిన కట్టెలమంటయేగాక ఆ వెలుగులో బియ్యము పప్పు ఉప్పులోసహా వంటపాత్రలు ఒకచోట అమర్చబడిఉన్నట్లు గ్రహించెను. ఈ వస్తువులుచూచి నవ కుమారుడు ఆశ్చర్యపడలేదు. కారణమేమన, అవి కాపాలి కునిచే యేర్పాటుచేయించబడెనని అతనికి తెలుసు.

“శాస్యం చ గృహ మాగతమ్” ఇదేమంత చెడ్డ మాటగాదు. “భోజ్యం చ ఉదరాగతమ్.” ఈమాటకూడా స్పష్టంగా అందరికీ తెలసినదే. నవకుమారునికికూడా వీటి అర్థము బాగా తెలుసును. అతడు సాయంకృత్యములు తీర్చు కుని ఆ పిమ్మట అక్కడఉన్న సామగ్రితో వంటజేసుకుని భుజించెను.

మరునాడు సూర్యోదయమైనవెంటనే లేచి సముద్రపు టొడ్డువైపుగా కుటీరమువదలి వెడలిపోయెను. నిన్నటి అనుభ వమువల్ల ఈనాడతడు త్రోవ తెలుసుకొనుటకంత శ్రమపడ నవసరము లేకపోయెను. ప్రాతఃకృత్యములు తీర్చుకుని నిన్న తా చూచిన ఆసుందరికొరకు నిరీక్షించుచూ అక్కడ ఉండిపోయెను. ఆమె అక్కడకు తప్పక వచ్చునని అతని ఆశ! అతని ఆ ఆశ ఎంత దృఢమైనదో చెప్పుట చాల కష్టము. అతడా ఆశతోనే ఆ ప్రదేశమును వీడి వెళ్ళలేకపోయెను. ఎంత ప్రొద్దెక్కినా ఆమెజాడ కనుపించలేదు. లేచి నాలుగు వైపులా తిరిగి చూచెనుగాని అతని అన్వేషణము ఫలించలేదు. తిరిగి తను మొదటగూర్చున్నచోటికేవచ్చి కూర్చున్నాడు. క్రమముగా సూర్యుడు అస్తమించాడు. చీకటి నలుమూలలా

వ్యాపించింది. చివరకు నిస్పృహ జెంది కుటీరమునకు తిరిగి వచ్చి వేశాడు. కుటీరములో నిశ్శబ్దముగా కాపాలికుడు కూర్చుని ఉండెను. నవకుమారుడు నమస్కరించి ఏదో ప్రశ్నించెనుగాని కాపాలికు డేమియూ పలుకలేదు.

"మరల ఇంతవరకు నాకు తమ దర్శనభాగ్యము లభించలేదేలకో?" అని నవకుమారు డడిగెను.

"వ్రతకార్యములందు నియుక్తుడనై యుండుటవలన." అనిమాత్రము కాపాలికుడు బదులుచెప్పెను.

నవకుమారునకు ఇంటికిపోవలయునన్న కోరిక మిక్కుటముగా యున్నది. కాని ఏవిధముగా వెళ్ళగలడు. తన కోరిక కాపాలికునకు తెలిపి "త్రోవ తెలియుటలేదు. ప్రభువువారేదైన మార్గముచూపి దారిబత్తెమున కేదైన యిప్పింతురని ఆశతో ఉన్నాను." అని అడిగెను.

ఉదాసీనభావముతో కాపాలికుడు "నావెంట రమ్ము" అని లేచి అక్కడనుండి బయలుదేరెను. ఇంటికి చేరుటకు తెరవు దొరకగలదన్న ఆశతో నవకుమారుడు అతని ననుసరించి బయలుదేరెను.

ఇంకనూ సూర్యాస్తమయము కాలేదు. పడమటిదిశన అస్తమయారుణకాంతులు విరాజిల్లుచున్నవి. ఆసమయమున కాపాలికుని వెంటనంటి నిశ్శబ్దముగ నవకుమారుడు పోవుచుండెను ఇంతలో అతని వీపుపై కోమలమైన హస్తస్పర్శమైనట్లయి వెనుదిరిగి చూచెను. అతని ఆశ్చర్యమునకు మేర లేదు. అతను గాంచిన దెద్ది? తా నారాత్రి ఏదివ్యమూర్తిని

గూర్చి రేయెల్ల చింతించియుండెనో ఆ సుదీర్ఘ కేశధారిణి, సౌందర్యమూర్తి, వనదేవతాస్వరూపిణియగు ఆరణ్యకయే. నాటివలెనే నేడునూ ఆమె నిశ్చలముగా యున్నది ఆమె పెదవులపై వ్రేలిడుకొని తన్ను మాట్లాడవలదని సౌంజ్ఞ చేయు చున్నట్లు నవకుమారుడు గ్రహించెను. అతడేమియూ పలుక లేదు. కాపాలికునితో తలవంచుకుని వెనుదిరుగకయే ముందు పోవుచుండెను. తనమాటలు వానికి వినపడనంత యెడ ముగా యుండుటచూచి ఆయువతి "ఎక్కడికి వెళ్ళుచున్నావు? అతనివెంట పోవలదు; పారిపొమ్ము" అని మెల్లగా అతని చెవియందు పలికి, అతని ప్రత్యుత్తరమునకైన తాళీయక తటి ల్లతవోలె వెళ్ళిపోయినది.

నవకుమారుడు ఒకింతసేపు విహ్వలుడై ఆమె వెంట పోవలయునని ఆలోచించెను. కాని ఆమె ఎటువైపుగా పోయి నది అతనికి తెలియలేదు. "ఇది యేదైన మాయయా ? లేక నాకు మతిభ్రమణ మేదైన కలిగినదా ? నేను విన్నమాటలు విపత్సూచకముగా నున్నవి; ఎవరివలన విపత్తు ? కాపాలికులు మంత్రవేత్తలు. వారెంతైన జేయగలరు అట్లయిన పారిపోవు టయే మంచిదా ! ఎక్కడకు పారిపోవలయును. పారిపోవుటకు దారియేది ?"అని ఆలోచించుచుండెను. ఇంతలో కాపాలి కుడు, తన వెంటనంటి రాకున్నందున వెనుకకువచ్చి "ఎం దుకు వెనుకబడుచున్నావు?"అని హెచ్చరించెను.

మానవుడు తొలుత తనకర్తవ్యమును పాలించక ఆసంగతిని తెలసికొని వెంటనే తానందు మరల నియుక్తు డయి శ్రద్ధ వహించుచుండును. అటులనే నవకుమారుడు

మరల కాపాలికునివలన హెచ్చరించబడకుండగనే అతని నను సరించి పోవసాగెను.

కొంత ముందుకు వారు సాగిపోయినంతనే ఎదుట మట్టిగోడలతో నిర్మించిన కుటీరమొకటి కానుపించెను. అది కుటీరమనుటకంటె చిన్న ఇల్లనిన సమంజసముగ నుండును. ఆయింటి వెనుక భాగమున సైకతభూమియు, సముద్ర తట మును మిక్కిలి దగ్గరగా కనుపించుచున్నవి. ఇంటిప్రక్క నుండియే కాపాలికుడు నవకుమారుని తీసుకుని పోవుచుండెను. మరల ఆ వెనుకటి రమణియే మెల్లగా వెనుకనుండి అతనిని సమీపించి నెమ్మదిగ "ఇపుడైన పారిపొమ్ము; కాపాలికుల పూజ నరమాంసములేనిదే పూర్తికాదన్న సంగతి నీ వెరు గవా?" అని చెప్పి వెడలిపోయెను.

అది వినిన నవకుమారునకు ముఖమున ముచ్చెమటలు పోసినవి. దౌర్భాగ్యవశమున ఆమె నవకుమారునికి చెప్పిన మాటలు ఆ కాపాలికుని చెవిన బడినవి. అతడు "కపాల కుండలా!" యని గర్జించెను.

ఈ యరపు నవకుమారుని మనస్సునకు మేఘగర్జనము వలె తాకెనుగాని కపాలకుండలమాత్రము యేమియూ జవా బివ్వలేదు.

కాపాలికుడు నవకుమారుని హస్తమును గట్టిగా పట్టు కుని తీసుకొనిపోసాగెను. ఆ మానవ హంతకుని చేతి స్పర్శ వలన నవకుమారుని శరీరమున నాడులయందు రక్త మతి వేగముగా ప్రవహింపజొచ్చెను. పోయిన ధైర్యమును చిక్క బట్టుకొనుచు "నన్నువదలుడు" అనిపలికెను. అందుకు కాపాలికు

డేమియూ పలుకలేదు. నవకుమారుడదిజూచి మరల "నన్నెక్కడకు తీసుకొనిపోవుచున్నారు?" అని అడిగెను.

"పూజా స్థలమునకు."

"ఎందునిమిత్తము?"

"వధించుటకొరకు."

ఇది విన్నవెంటనే అమితశక్తితో నవకుమారుడు తన చేతిని గుంజుకొనెను. ఆ ఊపు బలమునకు వే రెవరైన మానిసియైనచో తప్పక భూమిని కరచియుండెడివాడు. కాని కాపాలికుడు ఈషణ్మాత్రముకూడ చలించలేదు నవకుమారుని మణిబంధ మింకను ఆతని చేతియందే యున్నది. కాపాలికుడు దానిని మరింత దృఢముగా పట్టుకొనెను. ఆ పట్టువలన తన వ్రేళ్ళు విరిగినంత బాధగా యుండెను. బలము వలన ప్రయోజనము లేదనుకొని నవకుమారుడు ఏదైన ఉపాయమాలోచింపనెంచి మనస్సు స్థిరముజేసుకుని కాపాలికునివెంట నడువ సాగెను.

అట్లు వారొక ఎత్తైన యిసుకతిన్నె పైభాగమునకు చేరిరి. అక్కడకూడ ఒక కట్టెల నెగడు మండుచున్నది. దాని చుట్టునూ తాంత్రిక పూజోపకరణములగు పదార్థము లెన్నియో యమర్చబడియున్నవి. అందు నరకపాలములనిండ "ఆసవము" కూడ నింపబడియున్నది. గాని మానవమృత శరీరము ఒక్కటి మాత్రము కనుపించుటలేదు. అందునిమిత్తమై తా నిచ్చటకు కొనితేబడెనని నిశ్చయించుకొనెను.

ఎండిన అడవి తీగెలు కొన్ని పదును జేసి యక్కడ యిదివరకే సిద్ధముచేసి యుంచబడినవి. వాటితో కాపాలి

కుడు నవకుమారుని బంధించ మొదలుపెట్టెను. తన బలమంతయు ప్రయోగించి నవకుమారుడు పెనగులాడి చూచెను. కాని ప్రయోజనము కలుగలేదు. కాపాలికుడు మహాబలశాలి యని అతడు గ్రహించెను. యువకుని పెనగులాట జూచి కాపాలికుడు "మూర్ఖుడా ఏల శ్రమపడెదవు? ఈనాడు నీజన్మ తరించగలదు! నీ మాంసము భైరవీమూర్తికి నైవేద్యము కానున్నది. ఇంతకన్న సార్థక మున్నదా?" అనెను.

నవకుమారుని కాలుసేతులు దృఢముగా బంధించి క్రింద పడవైచి బలియిచ్చుటకు పూర్వము చేయవలసిన పూజావిధానమును చేయ కాపాలికుడు ప్రారంభించెను, అంతవరకు తీగెలను త్రెంచ నవకుమారుడు ప్రయత్నించుచునే యుండెనుగాని ఆ తీగె లతిబలముగను, దృఢముగను నుండెను మృత్యు వాసన్నమైనదని ఎంచి మనస్సున భగవంతుని స్మరించెను. జన్మస్థానము గుర్తునకు వచ్చినది అందు తన గృహము, తా ననుభవించిన సౌఖ్యములును, బహుదినముల నుండి వీడియున్న తన జననీ జనకులు మనస్సునెదుట గనుపింపజొచ్చిరి. అతనికి తెలియకుండగనే కనులనుండి నాల్గయిదు అశ్రుబిందువులు జారి యిసుకలోబడి యింకిపోయినవి.

బలియిచ్చుటకు పూర్వము జేయవలసిన తాంత్రిక పూజా విధానమంతయు పూర్తిజేసి కత్తికొరకై తా పెట్టిన చోట చూచెను. ఆతావున అది కనుపించలేదు. కాపాలికునకు మిక్కుటమగు ఆశ్చర్యము కలిగెను. ముందుగనే ఖడ్గమును తెచ్చి తా నా తావున భద్రముగ నుంచితినని యు, మరల వేరొకతావునకు మార్చలేదనియు అతని దృఢమైన నమ్మిక.

నలుమూలల వెదకిచూచెను, కాని అది కనుపించలేదు. అంత నతడు కుటీరపు ముఖముగా దిరిగి "కపాలకుండలా" యని పిలచెనుగాని ఎన్నిసార్లు పిలచిననూ ఆమె పలుకలేదు. అంత నతని ముఖము క్రోధముతో నెర్రబడినది. ఆలాగుననే కుటీరమువైపుగా పరుగెత్తిపోయెను. ఈ అదనుచూచి నవకుమారుడు మరల నొకపరి తన బంధముల త్రెంచుకొన ప్రయత్నించెను గాని ప్రయత్నము విఫలమైనది.

ఈ సమయమున తన సమీపమున ఏదో మృదుపదధ్వని వినవచ్చినది. నవకుమారుడు ఆవైపుగా ఒత్తిగిలి చూచెను. ఆమె కపాలకుండల. చేత ఖడ్గము ధరించియున్నది.

"మాట్లాడకుము, రహస్యముగ కత్తి తీసుకుని వచ్చితిని." అని త్వరితముగ నవకుమారుని బంధించిన తీగలన్నిటినీ కోసివేసి అతని బంధవిముక్తుని జేసినది. "వెంటనే ఇచ్చటనుండి పారిపొమ్ము; నీ వెనుకనే వచ్చి నీకు దారి చూపించెదను." అనుచూ శరవేగమున అతనికి దారిచూపించుచూ పరువిడెను. నవకుమారుడునూ ఆలశ్య మిసుమంతయును చేయక ఆమె ననుసరించి పోయెను.

## 7

కాపాలికుడు కత్తికొరకై కుటీరము నలుమూలల కలయ జూచెను. కత్తి కనబడక పోవుటయేగాక, అచ్చట నెచటను కపాలకుండలయు కానవచ్చుటలేదు. సంశయము గలిగి వెంటనే యతడు పూజాస్థలమునకు వచ్చి జూచెను. అచట నవ

కుమారుడు లేడు. అతనిని గట్టిన తీగెలు త్రెంపబడియున్నవి. క్రిందకానవచ్చినవి. ఆశ్చర్యముతో జరిగిన విషయమంతయూ అతడు గ్రహించెను. ఆలోచనా శూన్యముగా వారిని వెతుక బయలుదేరి పరుగెత్తెను. ఆ తొందరలో అత డేదిక్కుగా పోవుచున్నదీ తెలియుటలేదు. మధ్య మధ్య ఆగుచు, మాటల సవ్వడి యేమైన వినబడునేమోనని ఆలకించుచుండెను. కాని ఆతని కేసవ్వడియు వినవచ్చుటలేదు. తుద కతడు సముద్రపు టొడ్డునగల ఒక ఎత్తయిన కొండవంటి ఇసుక తిన్నెపై కెక్కి నలుమూలల వారికై కలయ జూచుచుండెను. దాని అంచు నుండి ఒక జలప్రవాహము పోవుచుండి ఒడ్డును ఆవైపుగా కోసివేయుచుండెను. కాపాలికుడు నలుమూలల తిరుగుచూ చూచు ప్రయత్నమున ఆవైపు ఒడ్డునకు రాగనే ఒడ్డు అతని బరువుకు విరిగి దానితోపాటు అతడు కూడ పర్వత శిఖరము నుండి జారిపడు శిలాఖండమువలె ఆ ప్రవాహమున పడి పోయెను.

## 8

నిశిరాత్రివేళ ఆ యువతీ యువకు లిరువురూ అరణ్య మార్గమున బడిపోవుచుండిరి. నవకుమారున కా ప్రదేశములు అపరిచితములు. అందువలన ఆతడు మార్గదర్శియగు ఆ పదు నారేండ్ల జవ్వని కపాలకుండల ననుసరించి పోవుచు మధ్య మధ్య తన "విధి వ్రాతను"గూర్చి చింతించుచు పోవుచుండెను. పోను పోను వారి వేగము మందగించినది. దూరమున మిణుకు మిణుకుమని వెలుతురును, ఆ వెలుతురునందు అడప దడప

వృక్షములును గానవచ్చుచుండెను. కొంతవడికి కపాల కుండల నవకుమారుని అరణ్య మధ్యస్థమగు ఒక దేవాలయ ప్రాంతమునకు చేర్చినది. ఆ సమీపముననే ఇటుకరాతితో గట్టిన ఇల్లొకటి యుండెను. కపాలకుండల ఆ యింటి ముంగిటకు జేరి ద్వారమును పదేపదిగ తట్టినది. లోనినుండి "ఎవరు వారు? కపాలకుండలా?" యని అడిగిరి. "ఔనమ్మా, తలుపు తీయుడు" అని ఆమె మారుపల్కినది.

తలుపు తెరువబడినది తెరచినది ఆ దేవాలయాధి కారిణి. ఆమె వయస్సు యేబదికిపైబడియుండును కపాల కుండల లోన ప్రవేశించి తన రెండు చేతుల ఆమె తలను వంచి ఆమె చెవి తన నోటిసమీపమునకు తెచ్చుకుని, తన వెంట వచ్చిన యువకుని సమాచారమంతయు ఆమెకు విడ మర్చి చెప్పినది.

పూజారిణి యిది విని చాలసేపటివరకు తలపై చేతు లిడుకొని దీర్ఘముగా ఆలోచించి, చివరకు "ఇది అంత తేలికైన విషయముగాదు. ఆ మాంత్రికుడు తలచిన యేమైన చేయ గలడు. భైరవీ అనుగ్రహమున్న నీకు శుభము కలుగుగాక! ఇంతకూ ఆ యువకుడెక్కడ?"

కపాలకుండల లోపలకు రమ్మనమని నవకుమారుని పిలచెను. బయట నిలువబడిన ఆతడు కపాలకుండల పిలుపు విన గానే లోపలకు వచ్చెను. పూజారిణి యాతని జూచి "నేడు నీవు నాయింటనే దాగియుండుము. రేపటి దినము మేదినీ పురప్రుతోవ నీకు జూపించి వచ్చెదను." అని చెప్పెను.

మాటల సందర్భమున నింతవరకు నవకుమారుడు భుజించియుండలేదని పూజారిణి గ్రహించెను. ఆయమ నవకుమారుని భోజనమునకై ఏర్పాటు చేయ మొదలిడెను. గాని నవకుమారుడు భుజింపనొల్లక, విశ్రమింప స్థలమునకై వేడుకొనెను. అర్చకురాలు అతనికి తన వంటయింట పరుండ నేర్పాటు చేసెను. నవకుమారుడు పరున్న తదుపరి కపాలకుండల తిరిగి సముద్రతీరమునకు మరలిపోదలచెను గాని, పూజారిణి అమిత ప్రేమతో ఆమెను విలోకించి, "అమ్మా! మరల అటకు పోవలదు. నా దొక చిన్నకోరిక యున్నది" అనెను.

"శలవిండు"

"నిన్ను గాంచినది మొదలు నాబిడ్డగా దలచి నిన్ను ఆ విధముగా పిలచుకొనుచు ఆనందించుచున్నాను. భైరవీదేవి పాదములసాక్షిగా, నిన్ను నేను, కన్నతల్లి ప్రేమను మించిన మాతృహృదయముతోడనే ప్రేమించుచున్నాను. నన్నవహేళనముచేయక నా యాచనను మన్నింపుము."

"తప్పక మన్నించెదను."

"మరల నీ వచ్చటకు పోవలదని నాకోరిక."

"ఏల పోరాదందురు?"

"అచటికి పోయిన నీ కింక రక్షణయుండదు."

"ఆ సంగతి నాకు తెలుసును."

"తెలిసియుండియు ఏలపోవుచుంటివి?"

"అచటికి పోకున్నచో ఇంకెచట ఉండగలను?"

"ఈ యువకునివెంట అతని గ్రామమునకుపొమ్ము"- అన. ఆమె అందులకేమియు మాట్లాడకూరకుండెను. అది చూచి ఆ ఆలయాధికారిణి "అమ్మా! ఏమో ఆలోచించుచున్నట్లున్నావు?" అని యడిగెను.

"ఈ శిష్యురాలు ఇంతకుముందు వచ్చినప్పుడు ఇట్టి యువకునివెంట వచ్చు టంతమంచిదికాదని సెలవిచ్చియు ఇపుడు ఈతనివెంట ఏల పొమ్మనుచుంటిరి!" అని.

"అపుడు నీ ముందుజీవితముసంగతిపై నాకు సంశయములేదు. యిప్పుడా ఆలోచన నాకు కలిగినది. నా వెంట రమ్ము. జగదంబ అనుమతిని తీసికొందువుగాని." అని పూజారిణి దీపము చేతబట్టుకొని ఆమెను వెంటనిడుకొని దేవాలయము తలుపులు దెరచి లోనప్రవేశించెను. ఆలయమునందు నిలువెత్తుగల భైరవీమూర్తి విగ్రహము ప్రతిష్ఠింపబడి యున్నది. ఆమె కిరువురునూ భక్తిభావమున ప్రణమిల్లిరి. అంత అర్చకురాలు అచ్చటగల పూజాద్రవ్యములనుండి ఒక మారేడుదళమును గ్రహించి, మంత్రయుక్తముగ దానిని భైరవీ పాదయుగళమందుంచి అటువంక చూచుచు ఉండిపోయెను. అట్లు ఒకటి రెండు క్షణములుండి కపాలకుండల వైపు తిరిగి "తల్లీ! చూడుము, ఈదేవి నీ అర్ఘ్యమును గ్రహించినది. బిల్వపత్రము పడిపోలేదు. నేను మనస్సున ఏది కోరి ఈ పత్రమును ఆమెపాదముల నిడియుంటినో దానికి భగవతి యనుజ్ఞ బడసితిని. నీ కవశ్యము మంగళము గలుగును. నీ వీ పథికునివెంట నిస్సంకోచముగా నరుగవచ్చును. విషయలంపటుల చరిత్ర నేనెరిగినదానను. ఆపన్నురాలైన ఒక

అపరిచిత కన్యను వెంటవేసుకుని తనవారి నడుమకు వెళ్లుటకు ఈతడు లజ్జించవచ్చును వారు నిన్నుకూడ దూషించెదరు. ఇతడు బ్రాహ్మణుడని నాకు తెలిపితివి. మెడయందు యజ్ఞోపవీతముగూడ గనబడుచున్నది. నిన్నితడు వివాహమాడి వెంటతీసుకుని పోయిన శుభము చేకూరగలదు. అట్లుగాకున్న నే నీతనివెంట నిన్ను పొమ్మని చెప్పియుండను."

"వివాహము!" అని మెల్లగానని, "ఈమాట మీనోటివెంట వినుచున్నాను. వివాహమని దేనినందురో నాకు తెలియదు. అంటే నే నేమి చేయవలయును?"

దేవాలయపు అధికారిణి మృదువుగా నవ్వి "స్త్రీలకు వివాహమనునది ధర్మసాధనకు ప్రథమ సోపానము వంటిది. ఇందువల్లనే స్త్రీని 'సహధర్మచారిణి' అని యందురు. భగవానుడగు శివుని, జగన్మాతకూడ వివాహమాడినది."

అర్చకురాలు పూర్తిగా ఆమెకు తెలియజెప్పితినని సంతృప్తిపొందెను. ఆమెయు తా నంతయు గ్రహించితినని తలపోసెను.

"అట్లే కానిండు. కాని, వారిని (కాపాలికుని) విడిచిపోవుటకు నాకు మనస్కరించుటలేదు. ఇంతవరకు వారు నన్ను పోషించుచుండిరి." అని ఆమె అనెను.

"అతడు నిన్నింతవరకు దేనికొరకు పోషించుచున్నాడో నీకు తెలియదు. స్త్రీత్వమును నాశనముచేసిననేగాని వీరికి తాంత్రికసిద్ధి కలుగదన్న సంగతి నీవెరుంగవు. జగదంబ! జగన్మాత! సతీత్వ స్వరూపిణి! సతీదేవి స్త్రీలకెల్ల ఆది దేవత. స్త్రీత్వమును నాశనముచేయు పూజలు వేటినీ

ఆమె స్వీకరించదు. ఈ కారణమువల్లనే నేను కాపాలికునకు అనభిమతమగు నీ కార్యమును జేయుచున్నాను. నీవు పారిపోయినచో కృతఘ్నురాలవని, నిన్నెవ్వరందురు? ఇంతవరకు అతనికి సిద్ధిబొందు సమయము ప్రాప్తించి యుండలేదు. కేవలము అందు నిమిత్తమే నిన్ను సాకుచున్నాడు. ఈ రోజు నీవు చేసినపని నీ ప్రాణముల మీదకే వచ్చినది. అందువలననే ని న్నీతని వెంట పొమ్మనుచున్నది. జగదీశ్వరి ఆజ్ఞ యిది. ని న్నిచ్చట నేను ఉండనిచ్చిననూ అది నీ ప్రాణమున కంత శ్రేయస్కరము గాదు." అని ఆలయాధికారిణి తెలియ జెప్పెను.

"అయిన, వివాహమే కానిండు."

అంత వారిరువురూ దేవికి నమస్కరించి ఆలయము నుండి బయటికి వచ్చి యథాప్రకారముగ తలుపులు మూసిరి. కపాలకుండల నొక గదియందు విడచి అర్చకురాలు నవకుమారుడు పరున్న గదిజొచ్చి తా నతని మంచము తలవైపున గూర్చుండి "నిద్రబోవుచున్నారా?" అని పలుకరించెను. నవకుమారుడు నిద్రించి యుండలేదు. అతడు అప్పటి తన పరిస్థితిని గూర్చి విచారించుచుండెను. పూజారిణి మాట విని "నిద్రించుటలేదు." అనెను.

"మీ పరిచయము తెలిసికొనవలయునని వచ్చితిని. మీరు బ్రాహ్మణులా?"

"చిత్తము."

"ఏ శాఖవారు."

"రాఢియాశాఖ మాది."

"నాదికూడ రాఢియాశాఖయే. ఓఢ్రదేశీయులమని యెంచబోకుడు. వంశాచారము ననుసరించి దేవీపదపూజ చేయుచున్నాను. తమ నామధేయము?"

"నవకుమారశర్మ."

"నివాస స్థానము?"

"సప్తగ్రామము."

"మీ గోత్రమేమంటిరి?"

"వంధ్యఘటి"

"వివాహమైనదా?"

"ఒక్కటి మాత్రమే."

నవకుమారుడు తన సంగతులన్నియూ సాంతముగ విడమర్చి చెప్పలేదు. యథార్థమునకు ఆ ఒక్క భార్యను కూడ అత నేలుకొనుటలేదు. అతడు రామగోవిందఘోష్ కుమార్తెను పెండ్లియాడెను. వివాహానంతరము 'పద్మావతి' కొంతకాలము పుట్టింటను, అప్పుడప్పుడు అత్తింటను ఉండు చుండెను. ఆమె పదునాల్గవ ఏట రామగోవిందగోసాల్ సకుటుంబముగ పురుషోత్తమ దేవుని సేవించబోయెను. ఆ సమయమున అక్బరు పాదుషా ఆజ్ఞానుసారము వంగదేశము నుండి తరుమబడిన పఠానులు ఉత్కల దేశమున బలమగు గుంపులు గుంపులుగ ఏర్పడి యుండిరి. తరచు పాదుషా సైన్యములకును, వీరికిని యుద్ధములు జరుగు చుండెడివి. రామగోవిందఘోష్ ఉత్కల దేశమునుండి తిరిగి

వచ్చునప్పుడు పఠానులకును అక్బరు సేనలకును యుద్ధము జరుగుచుండెను. గోసాల్ బాబు సకుటుంబముగ పఠానుల జేత చిక్కెను. పఠానులు వివేకశూన్యులు. వారు ధనమునకై నిరపరాధులగు యాత్రికులు మొదలగు ప్రయాణీకులను దోచు కుని బాధపెట్టుచుండెడివారు. గోసాల్ బాబు ఇంచుక కోప దారి. ఆతని పరుషభాషణములు విని వారాతని సకుటుంబ ముగ ఖైదు జేసిరి. చెరనుండి విముక్తి బొందుటకుగాను ఘోష్ మహాశయుడు స్వధర్మమును వీడి సకుటుంబముగ మహమ్మ దీయ మతమును స్వీకరించవలసివచ్చెను.

ఈ విధముగ గోసాల్ బాబు ప్రాణములు దక్కించు కుని సకుటుంబముగ ఇల్లుచేరుకొనెను. మహమ్మదీయ మతము స్వీకరించుటచేసి బంధువులందరు ఆతని బహిష్కరించిరి. అప్పటికి నవకుమారుని తండ్రి జీవించియేయుండెను. ఈ సంగతి తెలిసి జాతిభ్రష్టుని కుమార్తెను పుత్రవధువుగా స్వీక రించుటకు అత డిచ్ఛగించలేదు. అటుతరువాత మరెప్పుడును నవకుమారుడు తన భార్యను జూచియుండలేదు.

స్వసంఘ బహిష్కృతుడైన గోసాల్ బాబు ఎక్కువ కాలము స్వగ్రామమున యుండలేకపోయెను. ఈ పరిస్థితులలో అత డాలోచించి, రాజానుగ్రహమున ఏదేని ఉన్నత పదవి సంపాదింపదలచి రాజధానీనగరమగు రాజమహాలునకుబోయి, నివాసమేర్పరుచుకొనెను. మతాంతరుడయినందున తమ నామములుగూడ మహమ్మదీయ నామములుగ మార్చు కొనెను. మామగారు సకుటుంబముగ రాజధానీనగరమునకు పోయిన తరువాత తన భార్యయు, మామయు ఎట్లున్నదీ నవ

కుమారునకు తెలుసుకొన వీలులేకపోయెను. చిరకాల మతడు విచారించి, విరక్తిబొంది మరల వివాహమాడ తలపెట్టలేదు.

అధికారిణి కీ విషయములేవియూ తెలియవు. కులీను లకు రెండు వివాహములైనంతమాత్రమున వచ్చెడు ప్రమాద మేమియు లేదని మనమున అనుకుని పకాశముగ నవకుమారు నితో "ఈమె మీ ప్రాణరక్షణ చేసినది. పరహితార్థము తన ప్రాణములమీదకే తెచ్చుకున్నది. ఇంతవరకు ఈమెను పోషించిన మహానుభావుడు భయంకర స్వభావముకలవాడు. ఈమె ఆ మహాపురుషునివద్దకు తిరిగి వెళ్ళినచో మీ కిదివరలో పట్టినగతే ఈమెకును పట్టగలదు. కావున ఈమెను రక్షించు టకు మీ రేదేని ఉపాయము చూపలేరా?"

పడుకున్నవాడు లేచి కూర్చుని, "నన్నుకూడ ఆ అనుమానమే శాధించుచున్నది. మీరు చాల తెలిసిన అను భవజ్ఞులు. ఏదైన ఉపాయము మీరే చూపుడు. అలా చేయుటలో అవసరమైతే ప్రాణభయమున్నా నేను వెను దీయను. నాఅంతట నేనే స్వయముగా ఆ ప్రాణహంతకుని దగ్గ రకు తిరిగి వెళ్లినచో ఈమె ప్రాణము నేమైన రక్షింపగల నేమో నని ఆలోచించుచున్నాను" అనెను. పూజారిణి అతనిమాటలకు నవ్వి "అది వట్టి పిచ్చభ్రమ! దానివల్ల ఉపయోగమేమీ ఉండకపోగా మీ ప్రాణనష్టమగుటయేగాక ఆ తాంత్రికునివలన ఈమెకెట్టి నిష్కృతి ఉండదు. ఇక మిగిలి నది ఒక్కటే ఒక్క మార్గమున్నది."

"ఏ మార్గము?"

"ఆమె నీ వెంట పలాయనమగుటయే. కాని అది వీలుగాని పని. ఒకటి రెండుదినములకంటె యిక్కడుండుటకు వీలులేదు. అట్లున్నచో మరల అతనికి పట్టుపడుదురు. తరచు కాపాలికుడు ఈ దేవాలయమునకు వచ్చుచుండును. ఎటు జూచినను కపాలకుండల భాగ్యమున శుభము కానుపించుట లేదు."

నవకుమారుడు ఆవేదనా పూర్వకముగ "ఆమె నా వెంట వచ్చుటకేల వీలుగాదు!" అనెను.

"ఈమె ఏ కులస్త్రురాలో- ఎవరిపుత్రికో - ఎవరిపోషణ యందున్నదో- ఈమె చరిత్ర ఎట్టిదో అను సంగతులేమియు తెలియక ఈమెను మీవెంట గొనిపోయెదరా? అట్లు వెంట నిడుకొని పోయిన, మీవారు యింట ఈమెకు స్థానమివ్వ గలరా? అట్లు కానినాడు ఈ అనాధ మధ్యలో ఎచ్చటికి పోగలదు?"

"నవకుమారుడు కొంతసేపు ఆలోచించి నా ప్రాణ రక్షణచేసిన ఈమె కీమాత్రము సహాయము చేయలేనా; తప్పక ఈమె నా పరివారమునం దొకతె గాగలదు."

"మంచిది. కాని ఈమె ఎవరని మీ స్వజను లడిగిన ఏమిచెప్పగలరు!"

నవకుమారుడు మరల నించుకసే పాలోచించి "మీరే ఈమె పరిచయము కలుగజేయుడు. ఆ సంగతులనే నేను మా వారల కెరిగించెదను." అని అనెను.

"అటులనే జేసెదను. కాని నవయువ్వనులగు యువతీ యువకులు కలసి ఒకరికొకరు బాసటగ పది పన్నెండురోజులు

సుదీర్ఘమగు త్రోవను పోవ, జూచిన లోకు లేమనుకొందురు ? ఇది విన్న మీ బంధువులతో ఏమని చెప్పగలరు? నే నీమెను నా పుత్రికవలె ప్రేమించుచున్నాను. అట్టియెడ ఒక అజ్ఞాత యువకునివెంట ఈమెను పరదేశమున కెట్లు పంపగలను'' అని మనువులు గుదుర్చుటలో ఘటికురాలైన పూజారిణి అనెను.

''మీరుకూడ మావెంట రండు'' అని నవకుమారుడు కోరెను.

''నేను మీవెంట వచ్చిన యిచట భవానీమాత పూజార్చనలు ఎవరు చేయుదురు ?''

మనస్సు వికలతబొంద నవకుమారుడు ''అయిన మీరే ఉపాయము చూపలేరా ?'' అనెను.

''ఒకే ఒక ఉపాయమున్నది. అదైననూ నీ ఉదారతపై ఆధారపడి యున్నది.''

''ఆ ఉపాయమేది ? నే నేపనికి అడ్డుజెప్పను. అదేదో చూపింపుడు!''

''అయిన ఈమె వృత్తాంతము నాకు తెలిసినంతవరకు చెప్పెదను వినుము. ఈమె బ్రాహ్మణ కన్య. చిన్నతనమున శ్వేతముఖు లీమెను తస్కరించుకు పోవుచుండిరి. ఈప్రాంతములకు వచ్చునప్పటికి వారి ఓడ పగిలిపోయి అపాయమున చిక్కుకున్నందున వా రీమెను ఇచటి సముద్రతీరమున విడిచి పోయిరి. ఈవిషయములన్నియు తరువాత మీకు తెలుపగలను. ఆతరువాత కాపాలికు డీమెను చూచి మున్ముం దీమె, తన సిద్ధిక్రతువున కుపయోగపడునని యెంచి వెలం

తీసికొనిపోయి పెంచుచున్నాడు. త్వరలోనే తాదలచిన క్రతువునం దీమెను ఉపయోగింప సంకల్పించి యున్నాడు. యింతవరకు ఈమె అవివాహిత. పవిత్రమగు శీలముగలది. గాన ఈమెను వివాహమాడి మీఇంటికి గొనిపొండు. దీని కెవ్వరు మిమ్ము ను ఆక్షేపించరు. నేను యధాశాస్త్రముగ మీ కిరువురకు పెండ్లి జేయుదును.''

నవకుమారుడు మంచముదిగి గదియం దటు నిటు తిరుగుచు ఆలోచించసాగెను. అతడు అర్చకురాలి కేమియు జవాబివ్వలేదు. కొంత సేపటికి మరల పూజారిణి ఇప్పు డిక మీరు పరుండండి. తెల్లవారుఝామున నేను వచ్చి మిమ్ము లేపెదను. ఇష్టములేకున్న మీరు ఒంటరిగానే పోవచ్చును. మీకు నేను మేదినీపూరు త్రోవ చూపించి వచ్చెదను.

## 9

మరునాటి సూర్యోదయమునకు పూర్వమే పూజారిణి నవకుమారునివద్దకు వచ్చెను. రాత్రంతయు అతడు నిదుర బోలేదని గ్రహించి ''ఏమిచేయ నిచ్ఛగించినారు ?'' అని యడిగెను.

''నేటినుండి కపాలకుండలను నా ధర్మపత్నిగా స్వీకరించెదను. ఈమెకొరకు గృహస్థితికి దూరమైపోవలసినను వెనుదీయను. కన్యాదాన మెవరు చేయుదురు ?'' అని నవకుమారు డడిగెను.

పూజారిణి మనస్సు ఆనందమున పరవశమొందెను. ఆమెమనస్సులో "జగదంబ కృపవలన యిన్నాళ్ళకు నా కపాలకుండలకు స్థావర మేర్పడినది" అనుకొని నవకుమారునితో "కన్యాదానము నేనుచేయుదు"నని చెప్పెను. తదుపరి పూజారిణి తన పడకటింటికిపోయి పెట్టెనుండి అతి పురాతన మగు తాటియాకుల గ్రంథమొకటి తెచ్చి, దానిని పరిశీలనగ చూచి, నేడు వివాహమునకు ముహూర్తము మంచిదిలేదు. అయినను ఈరోజున యితర దోషము లేవియు లేవు. సంధ్యాసమయమున కన్యాదానము చేయుదును. అంతవరకు మీ రిరువురు ఈదినమున ఉపవాస వ్రత మూనవలయును. మిగతా వివాహ లౌకికకార్యములు మీ యింటివద్ద జరిపించుకోవచ్చును. ఈదినముమాత్రము మిమ్ము లను దాచియుంచగలను. కాపాలికుడు ఈనాడు వచ్చిననూ మీ జాడ తెలియనీయను. వివాహానంతరము రేపుదయమే పత్నియుతముగా మీ రింటికి పోవచ్చును."

నవకుమారు డందులకు సమ్మతించెను. అర్చకురాలు వీలున్నంతవరకు యథాశాస్త్రీయముగ భవానీ సాన్నిధ్యమున వివాహము జరిపించెను. కాపాలిక రక్షితయగు కపాలకుండలకు ఈవిధముగ ఆశ్రయము కల్పించెను.

కాపాలికుని ఉనికి తెలియలేదు. మరుసటిదినమున ప్రాతఃకాలముననే లేచి వారు ప్రయాణ ప్రయత్నమున నుండిరి. పూజారిణి వారిని మేదినీపురమునకు సాగనంపి రాదలచెను.

ప్రయాణమునకు ముందు కపాలకుండల భైరవీ మహా దేవి పాదములకు ప్రణామమొనర్చి భక్తిపూర్వకముగ మారేడుదళమొకటి పూలబుట్టనుండి తీసి ఆమె పాదములపై ఉంచి దానివంకనే చూచుచూ నిలుచుండిపోయెను. బిల్వ దళ మా దేవి పాదములనుండి జారి పడిపోయినది

భక్తపరాయణయగు దేవీచరణకమలములనుండి బిల్వ పత్రము జారిపడుట జూచి కపాలకుండల మిక్కిలి భయ పడెను. ఈసంగతి పూజారిణికి తెలిపెను. పూజారిణియు మిక్కిలిగ విచారించి "ఇప్పుడిక నీకు వేరుమార్గము లేదు. పతివెంట జనుటయే నీకు పరమధర్మము. ఆతడు స్మశానము నకు పోయిననూ నీవాతని ననుసరించి పోవలసినదే. వేరే మాటలాడక అతనివెంట పొమ్ము."

నిశ్శబ్దముగ ముగ్గురూ బయలుదేరి ప్రొద్దు చాలా పైకి వచ్చునప్పటికి మేదినీపురపు దారి చేరుకొనిరి. అచటనుండి పూజారిణి శలవుదీసుకొని వెనుదిరిగి పోయెను. కపాలకుండ లకు దుఃఖ మాగలేదు. పూజారిణియన్న ఆమెకు పంచ ప్రాణములు. సర్వప్రపంచములో తనకు సన్నిహితురాలగు ఆమె ఒక్కతెకూడ దూరమైపోవుచున్నదని వాపోవజొచ్చెను.

పూజారిణికికూడ విచార మాగలేదు, కొనగోట కన్నీటిని తుడుచుకుని కపాలకుండలను బుజ్జగించుచూ "అమ్మా, భగవతికృపవలన నాకు ధనాభావమేమియు లేదు. నీ కొంగునగట్టినసొమ్ము నీ భర్తకిచ్చి మేనా మొదలగునవి కుదుర్చమనుము. భగవతికృపవలన సత్సంతానవతివై మనుము. నన్ను మరువకుము." అని విచారభరమున కనుల నీరు

గ్రుక్కుకొనుచూ వెనుదిరిగి పోయెను. కపాలకుండలయు వచ్చు దుఃఖమును దిగమ్రింగుచు పతి ననుసరించి ముందునకు సాగెను.

# 10

మేదినీపురము చేరిన తరువరి అధికారిణి యిచ్చిన పైకముతో నవకుమారుడు కపాలకుండల నిమిత్తము ఒక దాసిని, రక్షకుని, పల్లకి బోయీలను గుదిర్చి అంతదా మెను ముందు బో నియమించెను. చేత పైకము విశేషముగ లేనందున తాను పాదచారియై బయలుదేరెను. నవకుమారుడు రెండు దినములనుండి శ్రమపడి డస్సియుండుటవల్ల మధ్యాహ్నము భోజనానంతరమునకు బోయీ లితనిని చాలా వెనుకను విడిచి ముందుపోయిరి. క్రమముగా ప్రొద్దు వాలినది. శీతాకాలపు మబ్బులు ఆకసమంతటా వ్యాపించినవి. చీకటి భూమి నలుమూలలా ఆక్రమించుకున్నది. కొద్దిగా చినుకులు గూడ పడసాగెను. నవకుమారుడు త్వరితగతిని బోయి కపాలకుండల నెపుడు కలుసుకొందునా యని ఆరాటపడజొచ్చెను. మొదటి మజిలీలో కలుసుకొనవచ్చునని ఎంచెను. కాని అచట నాతనికి కనుపించలేదు. అచటనుండి బయలుదేరి తిరిగి పోసాగెను. షుమారు రాత్రి తొమ్మిది-పది గంటలయి ఉండవచ్చును. నవకుమారుడు తీవ్రముగ నడక సాగించి పోవుచుండెను. ఇంతలో అతని కాలి కొక కఱ్ఱముక్క కొట్టుకొనెను. అతడు వేగమును తగ్గించి మెల్లమెల్లగ అడుగులు వేయునంతలో మరల అట్టిదే యింకొక కొయ్యముక్క కాలికి

తగిలెను. అతడు దానిని చేత నెత్తి చూచెను. ఆ మసక వెలుతురులో అది విరిగిపోయిన మేనా చెక్కయని తెల్సుకో గలిగెను.

ఆకాశమున చిరుమబ్బులు క్రమ్మియున్ననూ పెద్ద వస్తువు లేవియూ కనుపించనంత చీకటిగ లేదు. సమీపమున యేదియో పెద్ద వస్తువు పడియున్న ట్లతనికి కనుపించినది. అతడు దానిని చేతితో తాకి అది విరిగిపోయిన పాలకీయని తెలుసుకొనెను. పాలకి ఆ స్థితిలో చూచిన నవకుమారుని హృదయము కపాలకుండలకు ఆపదను శంకించెను. అతడు పాలకీకి మరింత దగ్గరగా పోవ అతని పదముల కేదో మృదు పదార్థము తగిలినది. అది ఒక మానవ శరీరమని తెలుసుకొనెను. ఆ శరీరముచెంత నేదియో ద్రవపదార్థము చేతికి తగిలినది. శరీరము మంచువలె చల్లనై యున్నది. చేయి పట్టి చూడ నాడు లాడుటలేదు. మృత శరీరమై యుండవచ్చును; కాని ఉచ్ఛ్వాస నిశ్వాస ధ్వని వినవచ్చుచున్నది. శ్వాస ఉన్నచో నాడి యెందులకు ఆడదు? అనుకొని ముక్కు రంధ్రములవద్ద చేయిడి చూడ శ్వాస ఆడుటలేదు మరి ఈ ఊర్పులశబ్ద మెచ్చటిది? అని ఆలోచించి బహుశః యిచట యింకొక జీవితమున్న వ్యక్తి ఉండి యుండవచ్చును అనుకొని ఇచట ఎవరైన ప్రాణములతో నున్నారా? అని నవకుమారుడు అడిగెను.

చాల హీనస్వరముతో "ఉన్నాను" అని బదులు వచ్చినది.

"ఎవరు నీవు?"

"నీ - వెవరవు ?" అది స్త్రీ కంఠస్వరమని నవకుమారుడు తెలుసుకొనెను. ఆత్రుతతో కపాలకుండలయా ?" యని నవకుమారు డడిగెను.

"కపాలకుండల ఎవరో నేనెరుగను. నేనొక బాటసారిని, దొంగలచేతబడి భంగపడినదానను."

ఆమె కష్టమును విని ప్రసన్నభావముతో నవకుమారుడు "ఏమి జరిగినది ?" అని అడిగెను.

"నా రక్షకులలో నొకనిని చంపి, నన్ను పాలకికి బంధించి నా యొంటినున్న నగలన్నియు దొంగిలించుక పోయిరి ?"

నవకుమారు డా చీకటిలో పరిశీలించి చూడ మేనాయందొక యువతి బంధింపబడియున్నది. అత డామె కట్లను విప్పి లేచి రమ్మనెను.

"బలముగా లాఠీదెబ్బలు నాకుగూడ దగిలినవి. చాలా బాధగా యున్నది. చేయూత నొసంగిన మెల్లగా లేచి వచ్చెదను."

నవకుమారుడు చేయూతనివ్వ అది అందిపుచ్చుకొని మెల్లగా లేచి పాలకీనుండి బయటికి వచ్చెను. అంత నత డామెను "నడువగలవా ?" యని అడిగిన దానికేమియు ఆమె సమాధానమివ్వక

"తమ వెంట నెవ్వరో వచ్చుచున్నట్లున్నది ?" అని అడిగెను.

"లేదు. నా వెంట నెవ్వరును లేరు."

"ఇచటకు సత్ర మెంత దూరమున్నది ?"

"దగ్గరలోనే యున్నదనుకొందును."

"అట్లయిన నేను కూడ మీవెంట సత్రమునకు వచ్చెదను. ఒంటరిగ యిచట చీకటిలో అడవియం దెట్లుండగలను. మీ సహాయమున్న సత్రమువరకు నేను కూడ రాగలను."

"అట్లే కానిమ్ము. ఆపత్కాలమున సంశయించుట మూర్ఖత్వము. నా భుజము నానుకొని రమ్ము." అనెను.

వా రనుకొనినట్లే సత్రము నిజముగా సమీపమందే యున్నది. ఆ రోజులలో సత్రము దాపుననే దొంగలు యిట్టి దోపిడులు తరచు సాగించుచుండిరి. అచిరకాలములోనే వారు సత్రము చేరగలిగిరి. సత్రమునందు కపాలకుండల దిగి యుండలేదు.

నవకుమారుడు విచారించి చూడ కపాలకుండల వేరొక యింటియందు దిగియున్నది. ఆమె వెంటనున్న దాసీలు ఈ యేర్పాటంతయు చేసియుండిరి. నవకుమారుడు తనవెంట నున్న ఆ స్త్రీనిమిత్తమై సత్రమునం దొక ఏర్పాటుచేయించి, అందు దీపముపెట్టించమని సత్రపు అధికారిణిని కోరెను. ఆ దీపపు కాంతియందు అత డామె అసాధారణ సౌందర్యమును చూడగలిగెను. ఆమెయౌవనశోభ, రూపలావణ్యసంయుతమై, శ్రావణమాసమునందు యుప్పొంగు నదివలె ప్రకాశించు చున్నది.

# 11

ఆమె సర్వాంగసుందరి. దేహ మొకింత దీర్ఘమైనను, అవయవములు సౌష్ఠవమును బొంది యౌవ్వన శోభను గూర్చుచుండెను. భాద్రపదమాసమందలి నిండునదివలె పదునేడేండ్ల వయస్సుననున్న ఆపె లావణ్యము ముగ్ధునిగావింప నవకుమారుడు రెప్పవాల్పక ఆమెవంకనే చూచుచు నిలుచుండిపోయెను.

తన్నట్లు రెప్పవాల్పక చూచుచున్న యతనిజూచి, "ఏమట్లు చూచుచున్నారు? నా సౌందర్యమునా?"

అతడామె మాటలకు లజ్జించి చూపులు త్రిప్పుకొనెను. కాని ఆమె కేమియు సమాధానమివ్వలేదు చిరునవ్వునవ్వి ఆమెయె "మీ రిదివర కెన్నడును స్త్రీలను చూచియుండలేదా? నే నంత సౌందర్యవతిగా కానుపించుచున్నానా?" యని మరల నడిగెను.

ఇట్టిమాటలు సాధారణముగ తిరస్కృతిని సూచించును గాని ఆమె నవ్వుచు పలుకుటచేత చమత్కృతిగ నుండెను. అతని కామె మాటలయందు వేరర్థమేదియు స్ఫురించలేదు. అందువలన "మధురములగు ఆమె ప్రశ్నలకేల జవాబివ్వకుండవలయును?" అనుకొని నవకుమారుడు "స్త్రీలను జూడకపోలేదు? గాని నీవంటి సౌందర్యవతిని జూచియుండలే"దనెను.

"ఒక్కతెనుగూడ చూడలేదా?"

ఈ మాట ఆమె అనిన వెంటనే అతని మనమందు కపాలకుండలా సౌందర్యము మెలగినది. వెంటనే అతడు "ఒక్క తెగూడ లేదనలేను" అనెను.

"అయిన ఎవరామె? మీ భార్యయా!"

"నా భార్యయని యెట్లూహించితివి?"

"మీరు వంగీయులరు. వంగదేశీయులు సర్వసాధారణముగ తమ భార్యలవంటి చక్కనివారిక ఉండరని అనుకొందురు!"

"ఔను. నేను వంగదేశీయుడను. నీవుకూడ వంగీయురాలివలె మాట్లాడుచుంటివి. ఏ ప్రాంతమునకు జెందినదానవు?"

ఆమె తన దుస్తులవంక జూచుకొనుచు "నేను మహమ్మదీయస్త్రీని. వంగదేశీయనుగాను." అనెను. దుస్తులను బట్టి చూడ అతని కామె ముసల్మానీ వలెనే కనుపించెను. కాని ఆమెమాట స్వచ్ఛముగ వంగవాసినివలెనే యున్నది.

"చమత్కారముగ లాలించి నాసంగతి నంతయు గ్రహించితిరి. నాకు మీ పరిచయముగూడ గలుగజేయుడు. మీరన్న ఆ సౌందర్యరాశి నివసించుచున్న దెచ్చట?"

"మాది సప్తగ్రామము."

"ఆమె కొంతవడి మాట్లాడకుండగ గూర్చుని, దీప మెగసన్ద్రోసి తలవంచుకొని ఈ మీ దాసిని మోతీబీబీ యందురు. దయచేసి తమ నామధేయము?"

"నవకుమారశర్మ."

అకస్మాత్తుగా గదియందలి దీప మారిపోయినది!

# 12

నవకుమారుడు మరల సత్రపు యజమానిని బిలచి దీపము వెలిగించి పొమ్మనెను. ఆ చీకటిలో ఒకటి రెండు నిట్టూర్పులు వినవచ్చినవి. దీపము వెలిగించిన తరువాత నచటికి కొక మహమ్మదీయ సేవకుడు వచ్చెను. "మీ రింత ఆలస్యము చేసితిరేల? మిగిలినవా రెచట నున్నారు?" అని మోతీబీబీ ప్రశ్నించినది.

"బోయీలందరూ త్రాగి చెల్లాచెదరుగ బోయిరి. వారి నందరిని ప్రోగుజేసి మేము వచ్చునప్పటికి త్రోవలో విరిగి పోయిన మీ సవారీ కనుపించినది. మీరు కనుపించకపోవుట వల్ల మా కేమియు పాలుపోక, కొందరి నచటనే యుంచి మరి కొందరిని వెదుకబొమ్మని, నే నిటు వచ్చితిని."

"వారినందరను పిలచుకొని రమ్ము."

అతడు ఆమెకు సలాముచేసి వెడలిపోయెను. బీబీ మౌనమువహించి కూర్చుండెను.

నవకుమారుడు కొంతతడ వాగి, లేచి "వెళ్లివచ్చెద" ననెను.

మోతీబీబీ నిద్రనుండి మేల్కాంచినదానివలె నిలువబడి "మీ రెచట బసచేసితిరి?"

"ఆ ప్రక్క యింటియందు."

"ఆ యింటిముంగిల మేనా యగుపించినది. మీ వెంట దానిపై వచ్చినవా రెవరు?"

"నా భార్య."

"ఆమె మరల జమత్కారముగ, ఆమెయేనా మీరు చెప్పిన అసమాన సుందరి?" అనెను.

"చూచిన నీకే తెలియును!'

"చూచుటకు వీలుకలుగునా?"

కొంచెమాలోచించి "అందు కభ్యంతర మేమున్నది" అనెను.

"అట్లయిన నాదొక మనవి. ఆ సౌందర్యరాసిని జూడ వలయునని నా కెంతయు గుతూహలముగా నున్నది. ఆమెతో ముందుగా బోయి చెప్పిరండు. పోనీ, యిప్పుడుగాదులెండి. నేనే గబురంపెదను." అనెను.

నవకుమారు డేమియు బలుకక వెడలిపోయెను. అంత గొందరు బోయిలూ, పరివారము వెంటరా మేనాయందు పెట్టెలతో నొక దాసీ వారివెంట వచ్చియుండెను. కొంత సేపైనతరువాత నవకుమారునకు "బీబీ జ్ఞాపకముచేయ మన్నా" రని కబురు పంపినది. నవకుమారుడు మరల ఆమె వద్దకువచ్చి చూడ, వెనుకటి దుస్తులుగాక ఆమె విలువైన చీనిచీనాంబరములు ధరించియుండెను. నిరలంకృతమైన ఆమెమేన నిప్పుడు అనర్ఘమణిస్థగితములగు సువర్ణాభరణము లెన్నియో విరాజిల్లుచున్నవి నవకుమారుని కనులు మిరుమిట్లుగొల్పినవి. అవి,నీలాకాశమున మెరయు నక్షత్రమాల వలె శోభాయమానముగనుండి ఆమెశోభను మరింత పెంపొందించుచున్నవి. నవకుమారునిజూచి "మహాశయా దయచేయుడు. మీభార్యతో పరిచయముచేసికొనివచ్చెదను!"

"అందునిమిత్త మింత అలంకార మనవసరము. నా భార్యకు సొమ్ములేమియూ లేవు !"

"లేకపోవచ్చును. ఈ అలంకరణమంతయు ఆమెకు జూపించుటకే. స్త్రీలకు తమ యలంకరణము లితరులకు జూపించకుండిన తోచదు. ఇక పోవుదము."

నవకుమారు డామెను వెంటదీసుకొని పోయెను. ఆమె దాసి "పేశ్మను" కూడ వారివెంట వచ్చినది.

కపాలకుండల ఆ యింట నేలపై గూర్చునియున్నది. ప్రక్కగా చిన్న దీప మొకటి వెలుగుచున్నది. ఆమె కేశరాశి చెదరి వీపుపై పడియున్నది. ఆమెనుజూచినంతనే మోతీకి కొంచె మచ్చెరువు గలుగకపోలేదు. పెదవులయందు చిరు నగవు పొడచూపినది. ఇంకను విపులముగ చూడవలయునని దీప మామె ముఖమువద్దకు ఎత్తినది. బీబీ మందహాస మంత రించినది. ఆమెముఖమందు గంభీరభావము పొడచూపినది. ఆమె కపాలకుండల ముఖమును ఱెప్పవాల్పక చూచుచుం డెను. వారిలో ఎవ్వరును మాట్లాడలేదు. తదేక ధ్యాన ముతో చూచి బీబీ తలయూచినది కపాలకుండల విస్మితు రాలైనది.

కొంత తడవైనపిమ్మట మోతీబీబీ తనశరీరముపై ధరించిన నగలన్నిటిని ఒకటొకటిగాతీసి, ఆ తీసిన సొమ్ములను మరల ఒక్కొక్కటిగాఁ దొడగి కపాలకుండల శరీరము నలంకరించెను. కపాలకుండల యేమియు మాట్లాడలేదు. నవకుమారు డది జూచి "అదేమిపని ?" అనెను.

అలంకరణ మంతయు పూర్తియైన తరువాత మోతీ బీబీ "మీరు నిజమునే చెప్పితిరి ఇట్టి పుష్పము రాజోద్యానములోగూడ బూయదు. ఇట్టి సౌందర్యరాశి రాజధానీ నగరమందుగూడ గానుపింపలేదు. ఈ నగ లీమె శరీరమున కెంతయు శోభ నిచ్చుచున్నవి. అందునిమిత్తమే వీటిని ఈమెకు అలంకరించితిని. మీరుకూడా వీటిని చూచిఅయినను అప్పుడప్పుడూ ఈ పరదేశీయురాలిని జ్ఞాపకముంచుకోగలరు."

నవకుమారుడు విచలితుడై "యిదేమిపని; యివన్నియూ బహుమూల్యములైన ఆభరణములు; వీటిని మేమేల తీసుకొనవలయును?" అనెను.

"ఈశ్వరకృపవలన నా కటువంటి వెన్నియో ఆభరణము లింకనూ గలవు. ఇంతమాత్రమున నే నాభరణహీననుగాను. వీటి నీమె ధరించుటవల్ల నా కానందము గలుగుచున్నది. ఈ నా ఆనందమును మీరేల వమ్ముజేయుదురు?"

ఈమాట లని మోతీబీబీ దాసిని వెంటబెట్టుకొని అచటనుండి తన గదికి బయలుదేరి వెళ్ళిపోయినది. ఒంటరిగ జూచి దాసి పేశ్మను "అమ్మా! ఈయ నెవరు?" మోతీబీబీ జవాబుగ "నా పతి" అని అన్నది.

## 13

మోతీబీబీ కపాలకుండలకు ఆభరణములు దాచుకొనుటకై ఒక దంతపు పెట్టెను పంపించినది. దొంగలు మోతీ

బీబీ ఒంటిపైనున్న నగలుమాత్రమే దోచుకొనిపోయిరి. ఆమె కడ విలువగల నగ లట్టి వెన్నియో గలవు.

నవకుమారుడు కపాలకుండల కొకటి రెండు నగలు మాత్ర ముంచి మిగిలిన వా దంతపుపెట్టెలో పెట్టి దాచి వేసెను. ఆ మరుసటి దినము ఉదయముననే నవకుమారుడు కపాలకుండలతో సప్తగ్రామమునకును, మోతీబీబీ వర్ధమాన మునకును బయలుదేరి వెళ్ళిరి. మేనాయందు కపాలకుండల నెక్కించి ఆమెకడ దంతపుపెట్టెనుంచి తాను కాలినడకను బయలుదేరెను. బోయీలు నవకుమారుని వెనుకన విడచి వేగముగా ముందు పోసాగిరి. సవారి తలుపొకటి కొంచెము తెరచియున్నది. ఆ సందునుండి కపాలకుండల అటు నిటు చూచుచుండెను. ఆమెను యాచించుచూ ఒక భిక్షుకుడు మేనా వెంటపడి వచ్చుచుండెను.

"నాకడ నేమియు లేదు. నీ కేమీయగలను?" అని కపాలకుండల ఆతనితో ననెను.

బిక్షుకుడు ఆమె మెడనున్న సొమ్ములను జూపుచు "అవేమి తల్లీ, నీ మెడయందు సొమ్ములు గనబడుచుండ నేమియు లేదనెదవేల"? అనెను.

"నగలిచ్చిన నీకు సరిపోవునా?"

బిక్షుకునకు ఆశ్చర్యముతోబాటు ఆశయు మిక్కుట మయినది. "తృప్తి కలుగకేమి తల్లీ!" అని యాత డనెను. కపాలకుండల సంశయించకుండగనే తన మెడ నున్న నగలు దీసి వాటితోబాటు దనకడ నున్న దంతపు నగలపెట్టె నగలతోగూడ నాతని కిచ్చివేసెను.

భిక్షుకుని కాశ్చర్యముతోబాటు మనస్సు విహ్వలత జెందినది. ఇంచుకసేపట డట్లుండి తరువాత వాడటు నిటు జూచుచు అచటినుండి వేగముగపారిపోయెను. కపాలకుండలకు వాడెందుల కట్లు పారిపోవుచున్నది బోధపడలేదు. ఈ సంగతి బోయీలకు గాని వెంటనున్న దాసీకిగాని తెలియనేలేదు.

# 14

పితృహీనుడగు నవకుమారుడు కపాలకుండలతో స్వగ్రామమున తన ఇంటికి జేరుకొనెను. ఇంటియందు అతని తల్లియు, యిద్దరు సోదరీలు ఉండిరి. పెద్దయామె విధవరాలు. రెండవయామె శ్యామసుందరి. సధవ. కులీనపత్నియయ్యును ఆమె భూషణములేమియు ధరించక యుండెను. నవకుమారుడు ముక్కు మొగ మెరుగని ఒక అజ్ఞాత తపస్వినిని వివాహమాడి యింటికి తోడ్కొనివచ్చినందుకు ఊరివారు, బంధువులు ఇంకొకప్పుడైతే ఎంత హంగామ చేసియుందురోగాని, అసలు తిరిగి రాడని నిర్ణయించుకున్నవారికి ఇతని రాక సంతోషమును గూర్చెను. వెనుకకు తిరిగివచ్చిన యాత్రికు లాతడు పులినోట బడెనని తెలిపియుండిరి.

పులినోట బడెనని వివిధరీతుల వర్ణించిన యాత్రికుల మాటలు విని నవకుమారుని తల్లి మూర్ఛబోయెను. ఊరిలోనిబంధువులు తక్కుంగలవారు హాహాకారములు జేసిరి. ఈ పరిస్థితులలో నవకుమారుడు వివాహమాడి భార్యతో యింటికి వచ్చెను. ఆ సమయమున అతని రాక కందరును సంతోషిం

చిరేగాని "కపాలకుండల ఎవరిబిడ్డ, కులగోత్రములే" మని ఎవ్వరును అడుగలేదు. నవకుమారుని తల్లి అత్యాదరముతో కోడలికి స్వాగత మొసగి యింటిలోనికి తీసికొనిపోయినది. కపాలకుండలను తనవారత్యాదరముతో జూడజూచి నవకుమారుడు యమితానందము బొందెను.

ఒకప్రక్క కపాలకుండలను భార్యగా పొందిసందున నవకుమారుడు ఆనందము పొందినను తనయింటి జను లామె నాదరించరేమోయను భయమున అత డామెయెడ ప్రేమను గాని, సంతోషమునుగాని నలుగురిలో యిదివరకు ప్రకటించి యుండలేదు. కపాలకుండలాస్వరూపము తన హృదయమున మూర్తీభవించియున్ననూ, ఎంతయో ఆలోచించిన మీదటగాని అతడు వివాహమున కియ్యకొనలేదు. ఆమెపై తనకున్న యనురాగమునైననూ వెల్లడింపలేదు. ఇప్పు డట్టి ఆటంకముగాని, భయముగాని ఆతనికి లేదు.

అతడు నయనములు పెద్దవిజేసుకొని సాకేక్షగా ఆమె వంక చూచుచుండెడివాడు. అవసరములేకున్నను యేదేని పనిగల్పించుకొని తరుచు ఆమెను పల్కరించి మాటలాడించుచుండెడివాడు. రేయింబవలు ఆమె సుఖమునకై చింతించుచున్నప్పుడుగూడ అతని కామెయందుగల ప్రేమభావము ప్రకటితమగుచుండెను. స్వభావమున చాపల్యముబోయి గాంభీర్యమును, ప్రసన్నతయు ఇప్పుడు గానవచ్చుచున్నవి. ముఖమెల్లప్పుడు ప్రఫుల్లముగ నుండుచుండెను. హృదయము ప్రేమపూర్ణమై యున్నందున పరులఎడగూడ స్నేహభావము పెంపొందుచున్నయది. అత డహితులయెడగూడ హితముగనే

మెలగుచుండెను. సత్కార్యములొనరించునిమిత్తమే పృథ్వి యందు జన్మనెత్తితిమని నమ్మగలిగెను. నవకుమారుని చరిత్రవలన తెలిసికొనగలిగిన దేదన, ప్రపంచమునంతను సుంద రముగ నున్నదని తెలిసికొనుట, యథార్థమైన ప్రేమతో కర్కశునికూడ సాధువుగ జేయగలుగుట, అసత్యవాదిని సత్యసంధునిగ జేయుట, మహాపాపిని పుణ్యునిగను, అంధ కారమున వెలుగు ప్రసరించునట్లుగను జేయవచ్చును అని.

ఇక కపాలకుండల! ఆమె యేభావము కలిగియున్నది? పోయి ఆమె నొకసారి దర్శించివద్దము.

# 15

ఒకప్పుడు సప్తగ్రామము అతులైశ్వర్యములతో దుల దూగుచుండెడిదని అందరకు అవగతమైన విషయమే. రోము నగరము మొదలు యవద్వీపమువరకు గల వ్యాపారులందరు ఈ సప్తగ్రామమున తరచు కలసికొనుచుండెడివారు పదు నొకండవ వంగశతాబ్దారంభమునుండి ఈ సప్తగ్రామ సౌభా గ్యము క్షీణింపనారంభించినది. కారణమేమన, ఏ నదీమతల్లి తన్నగరపరిసరమున ప్రవహించుచుండెనో అది యిప్పుడుసన్న గిలి, మెరకవేసిపోయినది. అందువలన పెద్దనావలు పూర్వము వలె రా వీలులేక వర్తకము సన్నగిలిపోయినది. ఆ కారణ మున నగర వైభవముగూడ తరగిపోయినది. వెనుకటిరోజు లలోనైనను హుగ్లీనదిపై వ్యాపారము విరివిగా సాగియున్నం

దున ఔన్నత్యమును బొందగలిగినది.యిప్పు డట్టి సౌకర్య ములు లేకపోవుటయే తన్నగరపతనమునకు కారణమైనది.

సప్తగ్రామమున నిర్జనమగు ఒక భాగమందు నవ కుమారుని యిల్లుగలదు. ఆ నగర పతనానంతరము వెనుకటి వలె యిప్పుడు జనుల రాకపోకలు లేక బొత్తుగా తగ్గి పోయినవి. మార్గము లన్నియు చికాకుగా నున్నవి. నవకుమా రుని యింటి వెనుకభాగమున విశాలమగు పెద్ద అరణ్యము గూడ నేర్పడినది. ఇంటి కెదురుభాగమున నొక క్రోసు దూర మున నొక కాలువ యున్నది. ఇటుకలతో గట్టిన అతనియిల్లు ఆకాలమున కది సామాన్య గృహమని చెప్పుటకు వీలులేదు. మేడ రెండంతస్తులు గలదియైనను, అంత ఎత్తుగ లేదు. ఆ యూరనే అంత ఎత్తుగల డాబాలుగూడ గలవు.

పైఅంతస్థు డాబాపయిన యిరువురు యువతులు అటు నిటు తిరుగుచు నల్వంకల కలయజూచుచుండిరి. సంధ్యా సమయమగుటవల్ల ప్రకృతి చూడ నెంతో రామణీయకముగా నున్నది. సమీపముననున్న యడవినుండి పక్షుల కలకలారావ ములు మనోహరముగ వినిపించుచున్నవి. ముందువైపున కాలువ నిర్మలముగ ప్రవహించుచున్నది. ఊరి కావైపున సౌధరాజములు విరాజిల్లుచున్నవి. దూరమున భాగీరథీ నదీ జలరాసులమీదుగ నెమ్మది నెమ్మదిగ చీకటి వ్యాపించు చున్నది.

ఆ యువతు లిరువురిలో ఒకతె పిప్పారి సంస్కరిం చని దీర్ఘములగు కురులచే పచ్చని తన సమున్నత శరీరమును కనుపడి కనుపడకుండునట్లు కప్పుకొని యున్నది. రెండవ

యామె నీలవర్ణ. పదునారేండ్ల ప్రఫుల్లముఖి. ఆమె పలు చని శరీరముగలిగి తదనుగుణ్యముగ పొట్టి తలకట్టు గలిగి యున్నది. విప్పారియున్న ఆమె నేత్రములు నల్లగలువ రేకు లను బోలియున్నవి. పచ్చని శరీరముగల యీయామె కపాల కుండల. రెండవయీయామె ఆమె యాడుబిడ్డ శ్యామసుందరి. కపాలకుండల తన చిన్నవ్రేళ్లను యాడుబిడ్డ కురులందు జొనిపి యాడుకొనుచున్నది.

శ్యామసుందరి వదినగారి నొక్కొక్కప్పుడు యింటి కోడలా! మరొకప్పుడు అక్కా! యనియు, వేరొకప్పుడు మృణా! యని ఆదరపూర్వకముగను పిలుచుచుండెడిది. కపాలకుండల యనుపేరు వికృతముగ నున్నదని వారామెకు "మృణ్మయి" అని పేరుపెట్టుకుని పిలుచుచుండిరి. దానినే చిన్నదిజేసి "మృణా" యని గూడ బిలుచుచుందురు. అప్పు డప్పుడు మనకుగూడ కపాలకుండల నా పేరనే పిలుచు టవసరము!

ఆ సమయమున తన చిన్ననాటి పాటయొకటి జ్ఞాపక మునకువచ్చి శ్యామసుందరి పాడదొడగినది. పాట ముగించి శ్యామసుందరి కపాలకుండలతో "నీవు తపస్వినివలె గూర్చుం టివేలనమ్మా?"

"నే నేమి తపస్సు చేయుచున్నాను?"

శ్యామసుందరి ఆమె తలకట్టుపై చేయిడి "ఈకురులను ముడుచుకొనకుండ ఎంతకాల మిట్లుందువు?"

మృణ్మయి చిన్నగ నవ్వి తన కురులను శ్యామసుందరి చేతినుండి వదలించుకొనెను.

"ఒకసారి నా కోర్కె దీర్చుము. ఎంతకాల మిట్లు యోగినివలె నుందువు? మా యింటి కోడలివలె నుండ రాదా? గృహిణివలె ఈ కురులను శృంగారించుకొనరాదా!"

"ఈ బ్రాహ్మణ యువకుని పరిచయము కలుగనంత వరకు యోగినివలె నుంటిని."

"ఇక న ట్లుండుటకు వీలు లేదు."

"ఎందువలన?"

"ఎందువలననో తెలుసుకుందువుగాని. ఇక నీయోగము విడగొట్టెదను. స్పర్శమణియని దేని నందురో నీకు తెలియునా?"

"తెలియదు."

"స్పర్శమణితో తాకిన ఇత్తడికూడ బంగారమగును."

"అయిన దానివలన ఉపయోగ మేమి?"

"స్త్రీలకుగూడ స్పర్శమణి యున్నది."

"ఏది?"

"పురుషుడు! మగవాని స్పర్శవలన యోగినికూడ భోగిని యగును. ఆ మణి నీకుకూడా తాకించి చూపించెదను చూడుము!"

మృణ్మయి "బాగుగా తెలిసినది. స్పర్శమణివలన బంగారమైతిని. మంచిబట్టలు కట్టుకొని పూలతో జడ ముడుచుకొందును. మేస కుంకుమాగరులు అలముకొందును. మెడలో చంద్రహారము ధరింతును. ఇవన్నియు చేసినంత మాత్రములో సుఖము కలుగునా?"

"పుష్పములు వికసించుటవలన కలుగు ప్రయోజన మేమో చెప్పగలవా?"

"మనము వాటినిజూచి యానందింతుము. కాని అందు వలన వాటికి గలుగు లాభ మేమున్నది?"

శ్యామసుందరి ముఖభావము గంభీరత బొందెను. ప్రభాతవాయుస్పర్శవలన రెపరెపలాడు కలువరేకులవలె ఆమె నేత్రములు విచలితములైనవి. "పూలవిషయమై నేను చెప్పలేనుగాని, నీవంటి మొగ్గనై యున్నచో వికసించి దుఃఖానుభవమును పొందియుందును"

శ్యామసుందరి కులవధువు. మృణ్మయి ఏమియు మాట లాడకుండుట చూచి "పూలు వికసించుటలోనే సుఖమున్నది. పుష్పరసము (తేనె) ను, సుగంధమును ప్రపంచమున కిచ్చుట లోనే పుష్పములకు సుఖమున్నది. ఇచ్చి పుచ్చుకొనుటయను నదే అసలు సృష్టిలో సుఖమనుదానికి మూలమైయున్నది." అని శ్యామసుందరి ఆమెకు చెప్పినది. మృణ్మయి వనవాసినిగ నున్నప్పుడు ఆమె మనసున నెన్నడు పుష్పము లనుగురించి యింతగ ఆలోచింపగల శక్తి గలిగి యుండలేదు. అందువలననే ఆమె శ్యామసుందరి కేమియు జవాబివ్వలేదు.

"అట్లయిన నీ కేది సుఖముగానుండునో చెప్పుము?"

ఆమె కొంచెమునే పాలోచించి "సరిగ చెప్పలేను; సముద్రపు దాపునగల ఆ అటవీప్రదేశములందు తిరుగుట యందు నాకు సుఖమున్నదనుకొందును."

ఆమె ఈ జవాబు శ్యామసుందరి కొకింత ఆశ్చర్య మును, కోపమునుగూడ కలిగించినది. తానుచేసిన ప్రయత్న

మంతయు వృధాయగుచున్నదని కొంత కించపడినది. "మరల అచ్చటికి తిరిగివెళ్ళుట కాలోచించుచున్నావా?" యని అడిగినది.

"లేదు."

"లేకున్న యేమి చేయుదువు?"

"యథా నియుక్తోస్మి తథా కరోమి" యని పూజారిణి చెప్పినది."

శ్యామసుందరి ముఖము ప్రక్కకు త్రిప్పుకొని వచ్చుచున్న నవ్వాపుకొని "చిత్తము! పండితమహాశయా! ఏమి శెలవిచ్చుచున్నారు?" అన్నది.

మృణ్మయి కొద్దిగా నిట్టూర్చి "భగవంతుడు ఏమి చేయించునో అది చేయుదును. ఆయన నాముఖమున యేది వ్రాసియున్నాడో అట్లు జరుగును."

"ముఖమున ఏమి వ్రాసియున్నది? అందు సుఖించుమని వ్రాసియున్నది. అట్లు నిట్టూర్చెదవేల?"

"అయిన విను. నేను భర్తవెంట బయలుదేరివచ్చునప్పుడు భవానీదేవికి నమస్కరించి ఆమెపాదములపై బిల్వపత్ర ముంచితిని. నే నేకార్యముచేయదలచినను ముందిట్లు చేయుచుందును. కార్యము సానుకూలమగునట్లయిన ఆ మహాతల్లి మారేదుదళమును గ్రహించును. లేనియెడల అశుభమే గలుగును. అపరిచితునివెంట బోవుచున్నందున శుభాశుభములు తెలుసుకొనదలచి ఆ దేవి పాదములకు నమస్కరించి మారేడుదళ ముంచితిని. దాని నద్దేవి గ్రహించలేదు. అందు

చేతనే విధివ్రాత ఎట్లున్నదోయంటిని.''ఇది విని శ్యామసుందరి చలించినది. మృణ్మయి మరి మాటాడలేదు.

## 16

ఆ యింటినుండి కపాలకుండలను తీసికొని నవకుమారుడు వెళ్ళిపోయినప్పుడే మోతీబీబీకూడ బయలుదేరి వేరొక మార్గమున వర్ధమానమునకు వెడలిపోయెను. ఈమె దోషకలిత చరిత్రయయ్యును మంచి గుణములు గలిగియున్నది.

ఈమెతండ్రి హిందూమతము వీడి సకుటుంబముగ మహమ్మదీయ మతమును స్వీకరించినతరువాత ఈమెపేరు "లుత్ఫున్నిసా''గా మారినది. స్థలాంతరములందు చరించునపుడు మారువేషమును ధరించి మోతీబీబీ యన్న పేరుతో వ్యవహరించెడిది. మతమును స్వీకరించినతదుపరి ఈమెతండ్రి ఢాకాకువచ్చి రాజసేవయందు నియుక్తుడయ్యెను. తరచు అచటకూడ నీతనికి స్వదేశీయుల సంపర్కము కలుగుచూ వచ్చెను. మతాంతరుడయిన కారణమున వారితో మెసలుటెంతయు నాతనికి కష్టముగా నుండెడిది. ఆ కారణమున అతడు మహమ్మదీయాధికారుల అనుగ్రహమును, స్నేహమును సంపాదించి. వారి సిఫార్సుల సహాయమున ఆగ్రాపట్టణముచేరి అక్బరుపాదుషా అనుగ్రహమునకు పాత్రుడయ్యెను. త్వరలోనే లుత్ఫున్నిసా తండ్రి ఆగాపట్టణమందు ముఖ్యులగు రాజోద్యోగులలో నొకడై, ఉమ్మరావులలో ముఖ్యుడు. గణనీయుడు నయ్యెను.

క్రమముగా లుత్ఫున్నిసాకు వయస్సు వచ్చుచున్నది. ఆగ్రాపట్టణమును జేరినప్పటినుండి సంస్కృతము, పారశీ భాషలేగాక నృత్య, సంగీత విద్యలను పూర్తిగా నభ్యసించి సౌందర్యమునందును, గుణమునందునుగూడ రాజధాని యందు పేరు ప్రఖ్యాతులను బడసినది. మతవిషయిక వ్యాసంగములయం దామెకు ప్రవేశ మేమియు లేదు. యౌవ్వనము వలన గలిగిన మనోవికారముల నణచుకొన కోరికగాని ఆలోచనగాని అప్పటి కామెకు గలుగలేదు. మంచి చెడ్డలను విచక్షణ చేయక తన మనమునకు తోచినరీతిని ప్రవర్తించుచుండెడిది. యౌవ్వనపు పొంగువలన గలుగు కొన్ని కోర్కెలుగూడ ఆమెకు జనించకపోలేదు.

ఆమె భర్త జీవించియుండెనన్న కారణమున ఉమ్రారావు లెవ్వరును ఆమెను వివాహమాడ నియ్యకొనకుండిరి. ఆమెకూడ వివాహమున కంత సుముఖురాలుగ నుండలేదు. తరచు "స్వేచ్ఛగా ప్రతి పుష్పముపైనను వ్రాలి తిరుగు భ్రమరము నెల యథేచ్ఛముగ తిరుగనీయక బంధించవలె" నని తలపోయు చుండెడిది. మొదట రహస్యముగ బయలుదేరి రానురాను బహిరంగముగనే ఆమె అపకీర్తిని గురించిన కథలు వినవచ్చినవి. ఆమె ప్రవర్తనపట్ల విరక్తుడై తండ్రి ఆమెను ఇంటినుండి వెడలగొట్టెను.

లుత్ఫున్నిసా రహస్యముగ తన కృపావీక్షణముల నాదరించుచుండెడివారిలో యువరాజు సలీ మొకడు. ఇంకొక కులకలంకుడగు ఒకానొక ఉమ్రారావుని పుత్రుడు, ఈకార్యము వల్ల పాదుషావారి కోపభాజనుడు గానేరక విరమించు

కొనెను. అందువల్లనే మొదట యువరాజీమెను తన జనానా యందు చేర్చుకొనుటకు సాహసించి యుండలేదు. తదుపరి మంచి అవకాశము చిక్కినది. రాజపుత్ర వీరుడగు రాజా మానసింహుని సోదరి యువరాజునకు పట్టమహిషి యయ్యెను. యువరాజప్పుడు లుత్ఫున్నీసాను తనభార్యకు ప్రధాన సహచారిణిగా అంతఃపురమున జేర్చెను. బహిరంగముగ ఈమె పట్టమహిషికి సహచారిణియు, పరోక్షమందు యువరాజు యొక్క అనుగ్రహభాగినియు నైనది.

కుశాగ్రబుద్ధియగు లుత్ఫున్నీసా అచిరకాలములోనే యువరాజగు సలీము హృదయమును తనవశము జేసుకొనెను. సమయముజూచి తాను రాణిగావలయునని యామె మనమున నిశ్చయించుకొనెను. రాజాంతఃపురమునగలవారందరును అట్లు జరుగుననియే తలపోయుచుండిరి. ఆమె గనుచున్న యిట్టి ఆశాస్వప్నమున కొక అవాంతరము వచ్చిపడినది. ఈ సమయముననే అక్బరుపాదుషావారి కోశాధికారియగు క్వాజా అబ్బాస్‌యొక్క పుత్రికయగు 'మెహరున్నీసా' యవనకన్యక లందరిలో సౌందర్యవతియని పేరుగాంచినది. ఒకనాడు కోశాధ్యక్షుడు కొందరు ముఖ్యులగు పురప్రముఖులతోబాటు యువరాజు సలీమును విందునకాహ్వానించెను. ఆనాడు యువరాజు మెహరున్నీసాను జూచి మోహపరవశుడయ్యెను. ఆపైనేమి జరిగినది ఇతిహాసమునగలదు. యోధాగ్రేసరుడగు 'షేర్ ఆఫ్ఘన్' నకును మెహరున్నీసాకును ఇదివరకునుండియు సంబంధ ముండియున్నది. ఈ సంగతి తెలిసి యువరాజగు సలీము ఆ బంధమును విడగొట్టించమని తండ్రిని వేడుకొనెను.

కాని పాదుషా కట్టిది యిష్టములేనందున అతనికోర్కె తిర స్కరింపబడినది. అందువలన యువరాజు నిరాశుడయిననూ ఆమెపై మోహమునుమాత్రము విడనాడలేకపోయెను. అతని చిత్తవృత్తి లుత్ఫున్నీసాకు పూర్తిగా అవగాహనమైనది. "షేరాఫ్ఘన్ ప్రాణములకు భద్రతయుండదు. మెహరున్నీసా పట్టమహిషికాక తప్పదని" ఆమె నిశ్చయించుకున్నది. అందువలన- తనకు సింహాసనమందుగల మోహమును, ఆశను పూర్తిగా త్యజించినది.

విశ్వవిఖ్యాత మొగల్‌సామ్రాట్ శ్రీ అక్బరుపాదుషా పరమాయువు పరిపూర్ణత జెందినది. తుర్కీనుండి బ్రహ్మపుత్రానదివరకు ఏ మహనీయుని ప్రతిభ ప్రచండ సూర్య ప్రతిభవలె ప్రకాశించుచున్నదో ఆ మహనీయు డిప్పుడస్తమింపనున్నాడు. ఈ సమయము చూచి లుత్ఫున్నీసా తన ఆత్మలోగల ప్రధానమైన కోర్కెను నెరవేర్చుకోగలందులకు ఒక దుస్సాహస సంకల్పమును జేసినది.

రసపుత్రవీరుడగు రాజా మానసింహుని సోదరి యువరాజగు సలీముయొక్క పట్టమహిషి. ఖుస్రూ ఆమె కుమారుడు. ఒకరోజున ఆమెతో అక్బరు పాదుషా ఆరోగ్యమును చర్చించు సందర్భమున, ఆమె చక్రవర్తిని యగునని లుత్ఫున్నీసా ఆమెను ప్రశంసించినది. అందుకు ఆమె "పాదుషాకు పట్టపు దేవేరినగుట మంచిదే, కాని అంతకన్న పాదుషాకు తల్లినగుట పరమోత్కృష్టమైనది." అన్నది. ఈ జవాబు విన్న లుత్ఫున్నీసా మనమున నిదివరకెన్నడును గలుగని యొక క్రొత్తయాలోచన పొడచూపినది. "అదికూడ ఏల కాకూ

డదు! అదియును తమ ఇచ్ఛానుకూలమే!'' యనెను. అందుపై నారాజపుత్ర బేగము, "అదెటుల?'' యని యడుగ "యువరాజకుమారుడగు ఖుస్రూకు సింహాసన మిప్పింపుడు.'' అని లుత్ఫున్నిసా బదులు చెప్పినది.

అందుకు బేగము ఏమియు జవాబివ్వలేదు. ఆరోజుకు మరల నాప్రసంగము యెవ్వరును తేలేదు. కాని ఆ విషయ మెవ్వరును మరువలేదు భర్తకు బదులు కుమారుడు సింహాసన మెక్కుట కా రాజపుత్ర బేగము కిష్టములేదు. మెహరు న్నిసాపై సలీమునకుగల యనురాగముపట్ల లుత్ఫున్నిసా కెంత కంటకముగ నుండెనో, రాజపుత్ర బేగమునకుగూడ నంత హృదయశల్యముగ నుండెను. రాజపుత్ర వీరుడగు మానసింహుని చెల్లెలు ఒక సామాన్య తురుష్కవనిత యాజ్ఞల కనుగుణ్యముగ ఎట్లుండగలదు? లుత్ఫున్నిసాకూడ ఈ అభిప్రాయముతోడనే దృఢమనస్కురాలై యుండెను. మరు నాడీ ప్రసంగము వచ్చినది. ఆఇద్దరు ఏకాభిమతమునకు వచ్చిరి. పాదుషా సలీమును కాదని ఖుస్రూకు సింహాసనము అభిషేకించుటకు ఎంతమాత్రము అంగీకరించడు. ఈ వాస్తవి కతను లుత్ఫున్నిసా బేగమునకు పూర్తిగా తెలియపరచినది. "మొగల్ సామ్రాజ్యము రాజపుత్రుల బాహుబలముచే స్థాపించబడినది. ఈరోజుకుకూడ వారిచే రక్షింపబడుచున్నది. ఆ రాజపుత్ర కులతిలకుడగు మానసింహరాజావారి మేన ల్లుడు ఖుస్రూ. మరియు మహమ్మదీయ శ్రేష్టుడు - ప్రధాన మంత్రియగు అజీమ్ - ఖుస్రూకు పిల్లనిచ్చిన మామ. వీరి ద్దరు నిలువబడి చేసినకార్యమును ఎవరు కాదనగలరు. అట్లయి

నప్పుడు యువరాజగు సలీము యే బలము చూచుకొని సింహా
సన మధిష్ఠించి అధికారమును చలాయించగలడు. రాజా
మానసింహు నిందు కంగీకరించునట్లు చేయుభారము మీపై
నున్నది. మహామంత్రి అజీమ్, తదితర ముఖ్యులగు ఉమ్మరా
వుల సమ్మతింపజేయుపని, నే జూచుకొందును. తమ ఆశీర్వాద
బలమున్న మన మీ కార్యమునందు కృతకృత్యులమాదుము.
కాని ఒక శంక నన్ను పీడించుచున్నది. సింహాసనమధిష్ఠిం
చిన తదుపరి ఖుస్రూ, నన్ను-వారిని, దురాచారులని... దేశము
నుండి బహిష్కరించు నేమో!"

బేగము సహచారిణి అభిప్రాయమను గ్రహించి, చిరు
నవ్వునవ్వి "నీ కాభయమక్కరలేదు. ఆగ్రాయందు ఏ ఉమ్మ
రావును నీ భర్తగా గోరుకొందువో అతడు నిన్ను వివాహ
మాడజేయుదును. మరియు అత డయిదువేల సైన్యమునకు
మంసబ్ దార్‌గా నియమింపబడగలడు."

అందుకు లుత్ఫున్నీసా సంతుష్టిబొందినది. ఆమె ఉద్దేశ
మేమన-సామాన్యయువతివలె, ప్రతిపూవుపై వ్రాలు తుమ్మెద
వలె నుండుటకన్న, స్వాధీనతను బోనాడి బాల్యసఖియగు
నొక మహమ్మదీయయువతి యూడిగమందు అస్వాధీనురా
లుగా నుండుట కెంతమాత్రము ఇష్టపడలేదు. అంతకన్న
ముఖ్యుడగు నొక రాజపురుషునికి భార్యననిపించుకొనుట గౌరవ
మని ఎంచినది.

కేవలము ఈ ఒక్క ఆలోచనతోడనే లుత్ఫున్నీసా ఈ
కార్యమును తలపెట్టలేదు. యువరాజు తన్నుపేక్షించి పిచ్చి

వానివలె మెహరున్నీసావెంటబడినాడు. అందుకు ప్రతీకారము జేయనెంచిగూడ నీ పని తలపెట్టినది.

ఖాన్ అజీమ్ మొదలగు ఆగ్రా, ఢిల్లీ వాసులగు ప్రముఖ ఉమ్రావులు ఏదో విధమగు పరిచయము లుత్ఫున్నీసాతో కలిగియుండిరి. అజీమ్‌ఖాన్ తన అల్లుని కార్యమునకు దోహద మిచ్చుటయేగాక తోటి ఉమ్రావులుకూడ యిందుకు అనుకూలురుగ నుండునట్లు జేసికొనెను. అతడు లుత్ఫున్నీసాతో "ఒకవేళ మనము కృతకృత్యులముగాని పక్షములో మన మానప్రాణములను రక్షించుకొను నుపాయమును ముందుగనే ఆలోచించుకొని యుండవలయును." అని తెలియపరచెను.

"అయిన మీ యాలోచనయేమి?"

"ఉత్కలదేశమునకన్న మనకు అనువగు తావు వేరొకటిలేదు. మొగలుల శాసన మంతనిరంకుశముగా అచట లేదు. అచటి సైన్యమును మనయధీనములో నుంచుకొనుట అత్యంతావశ్యకము. ఒరిస్సాయందు నీయున్న సైన్యాధిపుడుగా నుండెనుగదా? యుద్ధములో అతనికి గాయములయ్యెనని రేపటినుండియే ప్రచారము సాగించెద ననెను. నీ వదిసాకుగా నతని చూచుట కుత్కలకుపోయి అచట జేయవలసిన యేర్పాటులన్నియు జేసిరమ్ము." అనిచెప్పెను.

లుత్ఫున్నీసా ఈ సలహా కనుమతించినది. ఆమె ఈ కార్యార్థియై వెళ్ళి తిరిగి వచ్చుచు పాఠకుల కిదివరకే పరిచితురాలైనది.

## 17

ఏ దినమున మోతీబీబీ (లుత్ఫున్నిసా) నవకుమారుని కడ శలవుబొంది వర్ధమానమునకు పయనమయ్యెనో ఆరోజున ఆమె యెకాయెకిన అచటకు జేరలేకపోయెను. మధ్యలో ఒక సత్రమున ఆమె ఆగిపోయినది. సాయంత్రపువేళ, చల్లగాలికి కూర్చొని ఆమె దాసి పేశ్మన్‌తో ముచ్చటించుచుండెను. ఉన్నట్లుండి "నాభర్త ఏలాటివార"ని యామె పేశ్మన్‌ను అడిగినది.

పేశ్మన్ విస్మయముబొంది, "మీ ఉద్దేశ్యమేమి?"

"అందగాడౌనా కారా యని!"

నవకుమారునిపట్ల పేశ్మన్ విశేషించి విరక్తయై యున్నది. ఏ అలంకారములను మోతీ, కపాలకుండలకు యిచ్చివేసినదో వాటియందు పేశ్మన్ మిక్కిలి లోభము కలిగి యున్నది. వాటి నేనాటికైనా సంగ్రహించవలెనని మనమున నిశ్చయించుకున్నది. నేటితో ఆమె ఆశ నిరాశ యైనది. అందువలన కపాలకుండల, ఆమె భర్తయెడల ఆమెకు ఈర్ష్య కలిగినది. ఆకారణమున ఆమె యజమానురాలితో "దరిద్ర బ్రాహ్మణుడు సుందరుడైననేమి - కురూపి యైననేమి!" అని జవాబిచ్చినది.

సహచారిణి మనోభావమును గ్రహించి మోతీబీబీ చిరునవ్వునవ్వి "దరిద్రబ్రాహ్మణు డొకవేళ ఉమ్రావయ్యేనేని చక్కనివాడగునా, కాదా?"యని అడిగినది.

"కావచ్చును. గాని దీనిభావము ?"

"బేగమాసాహెబా యిచ్చినమాట నీవు వినలేదా ? ఖుస్రూ పాదుషా యయ్యేనేని, నాభర్త యుమ్మరా వగునని."

"ఆసంగతి నే నెరుగుదును. కాని నీ పూర్వపతి ఉమ్మరా వెట్లగునా యని ?"

"నాకు వేరే పతి యెవ్వరున్నారు ?"

"కానున్న యాతడు."

మోతీ యించుక నవ్వి "నాబోటి సతికి యిద్దరు పతులా ! ఇది చాలా అన్యాయపుమాట!- ఎవ్వ రా పోవు చున్నది ?"అని కేక వేసెను.

ఎవరినిజూచి యామె కేకవేసినదో యాతడు ఆగ్రా వాసియగు అజీమ్‌ఖానని పేశ్మక్ గుర్తించగలిగినది. అతని జూచి వారిద్దరు చకితులైరి. పేశ్మన్ వెళ్ళి వానిని తీసుకు రాగా అతడు లుత్ఫున్నీసాకు సలాముచేసి ఒక జాబునిచ్చి "ఈ జాబు తీసుకుని ఒరిస్సా వెళ్ళుచున్నాను. ఈ జాబు సతి జరూరుగా నందీయవలయు"ననెను.

ఉత్తరము చదువుకొని లుత్ఫున్నిసా తన ఆశాలత కూలిపోయినదని తెలసికొన్నది. లేఖయం దిట్లున్నది:

"మనప్రయత్నము విఫలమైనది. మరణసమయమువరకు తన బుద్ధిబలముచే అక్బరుపాదుషా మనల నోడించినాడు. అతడు దివంగతుడైనాడు. అతని ఆజ్ఞా బలమున యువరాజు సలీ మిప్పుడు జహంగీర్ పాదుషాయైనాడు. ఖుస్రూవిషయమై

నీవేమియు ఆందోళనచెందవలదు. ఈ సమయమున నీపై నెవ్వరును శత్రుత్వమువహింపరు. ఈ పరిస్థితులలో నీవు తిరిగి ఆగ్రాకు శీఘ్రముగ రావలయును."

వీరి ఈ షడ్యంత్రమును అక్బరుపాదుషా ఎట్లు విఫలముజేసెనో అది యంతయు చరిత్రయందుగలదు. గాన దానిని యిక్కడ విస్తరించుటలేదు.

వార్తాహరుని బహూకరించి పంపివేసి ఉత్తరము, నాసాంతము పేశ్మనుకు చదివి వినిపించినది. పేశ్మను అంతయు విని "ఇప్పుడింక ఉపాయమేమి! ఏదికావలయునో అదేఅయినది. యిప్పుడుమాత్రము మించిపోయినదేమి ! ఒక సామాన్యమానవుని భార్యగా నుండుటకంటె బాదుషావారి పరస్త్రీగా నుండుట చెప్పరానిదగ్గ విషయముగదా !"

అలా జరుగదు. నేనింక రాజమహాలునందుండ జాలను. తొందరలోనే మెహరున్నిసాను జహాంగీరు వివాహమాడును. చిన్నతనమునుండి నేటివరకు ఆమెను నేనెరుగుదును. ఆమె రాజాంతఃపురము ప్రవేసించిననాటినుండి జహాంగీరు పేరునకుమాత్రమే పాదుషాగాయుండును. ఆమె పాదుషాకు మహిషిగాకుండ నుండుటకు నే జేసినప్రయత్నము లామెకు తెలియరాకుండగనుండవు. అప్పుడు నాకెట్టి దశగలుగును ?"

"అప్పుడేమగును ?" అని పేశ్మన్ అడిగినది.

"ఒక్క ఆశమాత్రమున్నది. మెహరున్నిసాకు జహాంగీరుపై ప్రేమ ఎంతదృఢమైనది? ఒకవేళ ఆమె భర్తపై అనురాగిణియై యున్నయెడల ఒక షేర్ఆఫ్ఘనునేగాదు -

వందమందిని జంపించినను అత డామెను దక్కించుకోలేడు. అట్లుగాక మెహరున్నీసా జహంగీరునే అభిలషించుచున్న యెడల మన కిక ఆశలేదు.'' అన్నది.

''మెహరున్నీసా హృదయమునగలది మన మెట్లు తెలుసుకోగలము?''

మోతీ ఒక చిరునవ్వునవ్వి ''లుత్ఫున్నిసా తలుచుకున్న ఏమిచేయలేదు? మెహరున్నిసా నా బాల్యసఖి. రేపే బయలుదేరి వర్ధమానమువెళ్ళి ఆమె కతిథిగా రెండుదినము లుండి వచ్చెదను.''

''మెహరున్నీసా జహంగీరుపై అనురాగిణి గాకున్న ఏమిచేసెదవు?''.

''ఇదివరలో 'క్షేత్రే కర్మ విధీయతే' యని నాయన గారు చెప్పుచుండెడివారు.''

కొంతతడ విద్దరును ఏమియు మాట్లాడ కూరకుండిరి. లుత్ఫున్నీసా చిరునవ్వు నవ్వుచు మునిపంట పెదవిని గొరు కుచుండుట జూచి ''ఎందుకు నవ్వుచున్నారు?'' అని పేశ్మన్ ప్రశ్నించినది.

''మనస్సున కొక క్రొత్త యాలోచన తట్టినది.''

''ఏ మది?''

లుత్ఫున్నీసా దానిని పేశ్మన్‌కు తెలుపలేదు. ఆ విషయ మిప్పుడు పాఠకులకుగూడ తెలుపుటలేదు. ముందు ముందు తెలుపగలము.

# 18

షేర్ ఆఫ్ ఘను ఈ సమయమున వంగదేశమునకు సర్దారుగా బర్ద్వానయం దుండెను. మోతీబీబీ (లుత్ఫున్నిసా) బర్ద్వాను జేరి షేరాఫ్ఘన్ యింట దిగినది. యింటగలవారందరు అత్యాదరమున ఆమెకు స్వాగత మొసగిరి. షేరాఫ్ఘన్ అతని భార్య మెహరున్నిసా ఆగ్రాయం దుండునపుడు ఈమెకు వారితో సన్నిహిత మేర్పడినది. మెహరున్నిసాపై ఈమె కెక్కువ ప్రేమ కలదు. బాల్యసఖి, తరువాత ఇద్దరును కూడ సామ్రాజ్యకాంక్షతో ప్రతిద్వందు లయిరి. ఈ పరిస్థితులలో యిద్దరును కలసినప్పుడు మెహరున్నిసా తనలో "భారతవర్ష సింహాసనాధికార మెవ్వారి అదృష్టమున విధాత వ్రాసియున్నాడో జహంగీర్ పాదుషాకు తెలిసియుండవచ్చు. మోతీబీబీకి కూడ తెలియును. కాని ఆమె యేమియు బయల్పరచలేదు." అని అనుకున్నది. మోతీబీబీకూడ మెహరున్నిసా అభిప్రాయమును తెలుసుకొనవలెననియే అభిలషించుచున్నది.

ఆనాటికి భారతవర్షమంతటను మెహరున్నిసా ప్రధాన రూపసిగా పేరుపొందియుండెను. వాస్తవముగ ప్రపంచమునందిట్టి సుందరీమణులు బహు కొద్దిమందిమాత్రమే యుండి యుందురు. చరిత్రకారులుకూడ ఈమెను అద్వితీయ సుందరీమణిగ చిత్రించి యుండిరి. ఆ కాలమున పురుషులయందుగూడ ఆమెకంటె విద్యాధికులైనవారు అంత ఎక్కువ మంది లేరు. చిత్రలేఖనమందేగాక సంగీత సాహిత్యము

లందును అద్వితీయు శక్తిని గనుపరచి రంజింపజేయుచుండెను. మోతీబీబీకూడ ఈ గుణము లన్నింటియందు ఆమెకు తీసిపో దనవచ్చును. అట్టి ఈ చమత్కారిణు లిరువురును ఒకరి మనస్సు నింకొకరు తెలిసికొన ప్రయత్నించుచుండిరి.

మెహరున్నీసా తన గదిలో చిత్రలేఖనమందు నిమగ్నమై యున్నది. ఆమెకు వెనుకభాగమున కూర్చుండి మోతీ తాంబూలము సేవించుచు చిత్తరువును జూచుచున్నది. కొంతవడికి మెహరున్నీసా "చిత్తరు వెట్లున్నది?" అని మోతీ బీబీ నడిగినది.

"నీ మనమం దెట్లుండవలయునని కోరుకొంటివో అట్లేయున్నది చిత్రలేఖనమందు నిన్ను మించినవా రొక్క రైన లేరే అని చింతించుచున్నాను"

"నిజముగా ఆమాటే యధార్థమైనచో అందుకు చింతించవలసిన అవసరమేమున్నది?"

"అటువంటివా రున్నయడల సౌందర్యాదర్శమగు నీ ముఖమును చిత్రించియుందురు."

"ఈముఖము స్మశానములో భూస్థాపితమైనప్పు డచట ఆదర్శముగ నుండును."

"సోదరీ! హాస్యరసప్రియమగు నీ హృదయభావము నే డిట్లున్న దెందులకు?"

"రేపు ఉదయమే ప్రయాణమై పోవుచున్నాన న్న విచారముతప్ప అట్టిదేదియు నా మనమందు లేదు. ఇక రెణ్ణాళ్ళుండి నాకు సంతోషముగూర్చి పోరాదా!"

"సుఖమును గోరనివా రుందురా? నాకుగూడ నుండ వలయుననియే యున్నది. గాని ఎట్లుండగలను! పరాధీన నైతిని!"

"వెనుక నున్నంత ప్రేమ నీకు నామీద ఇపుడు లేదు. అట్లేయున్న ఇచటకు వీలుజేసికొని రాగలిగిన దానవు మరి రెణ్ణాళ్ళుండ ఏల వీలుగాదు?"

"ఉన్న విషయమంతయు జెప్పితిని, నాసోదరుడు మొగల్ సైన్యమున మన్సబుదారుడు. ఒరిస్సా యుద్ధమందు సంకటపడియున్నాడు. ఆతని ఈకబురు తెలసి, బేగము సెలవుపొంది బయలుదేరి వచ్చితిని. ఒరిస్సాయందు చాల దినములు గడచిపోయినవి ఇప్పు డింక అలస్యముచేయుట ఉచితముగాదు. నిన్ను కలసి చాలదినములాయెను. రెండునా ళ్ళీటనుండి పోవలయుననియే వచ్చియుంటినిగదా."

"ఆమెకడ ఎన్నాళ్ళు సెలవుబొంది వచ్చితివి."

మెహరున్నిసా వ్యంగ్యముగా మాట్లాడుచున్నదని మోతీబీబీ గ్రహించినది. నర్మ మర్మముగ మాట్లాడుట యందు మెహరున్నిసాకున్న నిపుణత మోతీకి లేదు. అయిన నంతమాత్రములో అప్రతిభురాలును గాదు. రాను పోను మూడుమాసములకు తక్కువపట్టదు. నిశ్చితముగా చెప్పుటకు వీలులేదు. ఇప్పటికే చాల విలంబన జేసితిని. ఇంకను ఆల స్యము చేసినచో వారికి అసంతుష్టి కలుగవచ్చును.

మెహరున్నిసా లోకమోహనమగు ఒక చిరునవ్వునవ్వి, "ఎవరికి అసంతుష్టి కలుగునని సంశయించుచున్నావు. యువరాజుకా? అతని పట్టమహిషికా?"

మోతీబీబీ కొంచెము కుంచుకుపోయి "లజ్జావిహీన నగు నన్నింకను ఏల లజ్జింపజేసెదవు. వారిద్దరుగూడ అసంతుష్టి బొందుదురు."

"నేను మనస్ఫూర్తిగా నిన్నడుగుచున్నాను. నిజము చెప్పుము. నువ్వే స్వయముగా ఎందుకు బేగముగాలేదు? సలీముకూమారుడు నిన్ను వివాహమాడి పట్టమహిషిని జేయ నభిలషించెనని వింటిని. ఎందుకింత ఆలస్యమయినది?"

"నేను స్వభావముగ స్వతంత్రాభిలాషిణిని. నాకున్న స్వాతంత్ర్యమును కాస్త వెలగోల్పవలయును. బేగమునకు సహచారిణి నగుటవల్ల ఒరిస్సా రాగలిగితిని. సలీము కుమారునకు బేగమునయినచో నాకీ స్వతంత్రత ఎట్లుకలుగును!"

"ఢిల్లీశ్వరుని పట్టమహిషివైనప్పుడు ఒరిస్సాకు నీవు రావలసిన అవసరమేముండును?"

"సలీము కుమారుని పట్టమహిషిని కావలయునని నే నెన్నడును కోరుకొనలేదు. హిందూస్థాన మంతటను ఢిల్లీశ్వరుని పట్టమహిషి గాదగ్గది ఒక్క మెహరున్నిసాయే యని నే నెరుగుదును."

ఈ మాట విని మెహరున్నిసా తల వంచుకుని కొంత సేపు మౌనమువహించి తరువాత "నీవు నాకు దుఃఖము కలుగ జేయాలనే ఉద్దేశ్యముతో ఈ మాట లన్నావో లేక నా మనోభావమును తెలుసుకోవాలని అన్నావో తెలియదు కాని, నేను షేర్ ఆఫ్ఘన్ ధర్మపత్నిని. అతని దాసిసన్న సంగతి మరచి ఈలాటి ప్రసంగము చేయవద్దని నిన్ను వేడుకొను చున్నాను."

లజ్జను పాటించని మోతీ ఈ తిరస్కారమువలన సిగ్గు బడలేదు. మీదుమిక్కిలి ఆమె కింకను అట్టి ప్రసంగముచేయుట కవకాశము చిక్కినది. "నీ వెంత పతిగత ప్రాణవో నాకు తెలుసు. అందుచేతనే నే నిట్టి ప్రసంగము తెచ్చితిని. సలీము యువరాజు నీ సౌందర్యము నింకను మరచిపోయి యుండలేదు. అందుచే నిన్ను సావధానవుకమ్మని హెచ్చరించుటకే యిట్లు మాట్లాడుచున్నది."

"సరి ! ఇక తెలసినది. అందువలన భయమేమున్నది?"

మోతీబీబీ కొంచెము సంశయించి "వైధవ్యశంక" ఈమాటచెప్పి మోతీ మెహరున్నిసా ముఖకవళికల నొకకంట కనిపెట్టుచునేయున్నది. కాని మెహరున్నిసా ముఖభావమున భయముగాని - ప్రసన్నతగాని ప్రకటితముగాలేదు మీదు మిక్కిలి ఆమె దృఢమగు స్వరముతో "వైధవ్యశంకయా? షేర్ మహమ్మదు తన్నురక్షించుకోలేని భీరువుగాడు; అక్బరు పాదుషా రాజ్యమందు అతని కుమారుడైనను అకారణముగ నొకని ప్రాణమును తీసి తప్పించుకొనుట సాధ్యముకానిపని."

"అదివాస్తవమే! కాని ఆగ్రానుండి వచ్చిన తాజా వార్తలు నీ కింకనూ తెలియలేదుకాబోలు? అక్బరుపాదుషా స్వర్గస్తులైనారు. యువరాజు సలీము సింహాసనారూఢుడై నాడు. ఇక అతని నెవ్వరడ్డగలరు?

మెహరున్నీసా ఆపైన వినలేకపోయినది. ఆమె శరీర మాపాదమస్తకము వణకసాగినది. తల మరల వంచుకున్నది. ఆమె నేత్రములు రెండూ జలపూరితములైనవి. అదిచూచి "ఎందుల కేడ్చెద' వని మోతీబీబీ యడిగినది

మెహరున్నీసా ఒక దీర్ఘ నిశ్వాసము విడచి "సలీము భారత సింహాసన మధిష్ఠించినాడు. ఇక నాగతి ఏమగునో యని విచారించుచున్నాను."

మోతీబీబీ కోరిక సిద్ధించినది. మెహరున్నీసాతో "ఈ రోజుకుకూడా' నీవు యువరాజును ఒక్క క్షణమైనను మరచి యుండగలిగితివా?"

మెహరున్నీసా గద్గదస్వరముతో "అక్కా, నీయెదుట నా మనఃకవాటమును దెరచితిని యువరాజు నెట్లు మరువ గలను. నా ఆత్మ జీవనమును మరచిననూ యువరాజును మరువలేను; యథార్థము నీకుకాబట్టి తెలియపరచితిని. పై వారి కెవ్వరికీ తెలియనీయకుము. నాపై ఒట్టు సుమా!" అన్నది.

"మంచిది. అలాగుననే! ఒకవేళ నేను వర్ధమానము నుండి వచ్చితినని తెలిసి సలీము యువరాజు 'మెహరున్నీసా నన్నుగురించి ఏమన్నది' అని నన్ను తప్పక అడుగవచ్చును. అప్పుడు నే నాతని కేమని చెప్పవలయును?"

మెహరున్నీసా కొంతతడవు ఆలోచించి "మెహ రున్నీసా హృదయమున తన్నెప్పుడును ధ్యానించుచుండునని చెప్పుము. అవసరమైనయెడల తమకొరకు ప్రాణములుగూడ విసర్జించగలదనుము. కాని కుల, మానములను సమర్పింప లేదనుము. నా పతి జీవితాంతమువరకు అతనికి నాముఖము చూపింపలేను. ఒకవేళ ఢిల్లీశ్వరుని పనుపున నా పతి హతు డయ్యేనేని, నాస్వామిహంతకుని ఈజన్మమున దర్శించనని చెప్పుము."

ఈమాటలని మెహరున్నీసా తాను కూర్చున్నస్థానమునుండి లేచినది. మోతీబీబీ ఆశ్చర్యాన్వితయైపోయినది. కాని విజయము సాధించినది. మెహరున్నీసా మనోభావమును బయటపెట్టగలిగినది. పాపము మెహరున్నీసా మోతీహృదయమునగల ఆశ నిరాశభావనలనేమిగాను తెలిసికొనలేకపోయినది. తన ఏ బుద్ధికుశలతచేత ముందుముందు ఢిల్లీశ్వరునికి ప్రాణేశ్వరియై మనగలిగినదో ఆ బుద్ధికుశలత చతురమతియైన మోతీముందు ఉపయోగపడినదిగాదు కారణము— మెహరున్నీసా ప్రణయ స్వరూపిణి. మోతీబీబీ స్వార్థపరాయణ.

మానవ హృదయగత విచిత్ర స్వభావము లెట్లుండునది మోతీబీబీకి చాల బాగుగ తెలియును. ఆమె మెహరున్నీసావిషయములో ఆలోచించి ఏమి స్థిరపరచుకొనియున్నదో నేడు యథార్థముగ అదే తెలసికొన్నది. ఆమె జహంగీరును (సలీము) హృదయపూర్వకముగ ప్రేమించుచున్నది. వాస్తవముగ అతనికి ప్రణయానురాగిణి నారీ సహజమగు దర్పముతో పై కిప్పు డేమన్నను కాలవశమున సుయోగము తటస్థించినప్పుడు తన మనస్సు పోవుగతి నడ్డగించదు. పాదుపాగూడ తన దీర్ఘ మనోకామ్యమును సిద్ధించుకొనును.

ఈ సిద్ధాంతీకరణముపై మోతీబీబీయొక్క సమస్త ఆశలు వమ్మయిపోయినవి. అందువలన ఆమెదుఃఖించినదా? లేదు. మీదుమిక్కిలి అందువలన ఏదో ఒక సుఖానుభూతిని గూడ పొందగలిగినది. హృదయమునం దామె కిట్టి భావ మేల కలిగినదో మొదట తెలసికొనలేకపోయినది. ఆమె ఆగ్రాకు ప్రయాణమై వెళ్ళిపోయినది. ప్రయాణమున చాలా రోజులు

గడచిపోయినవి. ఆరోజులలో ఆమె తన చిత్తపరివర్తననుగురించియే తలపోయుచుండెను.

# 19

యథాసమయమునకు మోతీబీబీ ఆగ్రా చేరుకున్నది. ఇంక యిప్పుడామె నాపేరున పిలువ నవసరముండదు. ఈమధ్య కొన్నాళ్ళనుండి ఆమె మనోప్రవృత్తి పూర్తిగామారిపోయినది. పాదుషానుకూడ కలుసుకున్నది. అతడామెను పూర్వమువలెనే అనునయించి ఆదరించెను. తన సహోదరుని క్షేమసమాచారమును, తనప్రయాణపు విశేషములుగూడ అడిగెను. లుత్ఫున్నీసా మెహరున్నీసాతో ఏమనిచెప్పినదో అది యథార్థమయినది. కుశలప్రశ్నలు,తదితరప్రసంగము లయినతరువాత వర్ధమాన విషయమువచ్చి జహంగీరు "వర్ధమానమున కొన్నాళ్లుంటినంటివికదా, నావిషయమున మెహరున్నీసా ఏమని ప్రసంగించినది ?" అని అడిగెను. లుత్ఫున్నీసా మెహరున్నీసా ప్రణయవ్యాసంగమునంతయు జహంగీరున కెరుకపరచినది. అది విని పాదుషా విచలితుడై మౌనమువహించెను. ఆతని నేత్రములనుండి ఒకటి రెండు నీటిబిందువులు నేలరాలినవి.

"జహాపనా ! శుభసందేశమొసగిన ఈ దాసి కేదైన పురస్కృతి గల్పింపుడు"అని లుత్ఫున్నీసా హెచ్చరించినది.

చక్రవర్తి చిరునవ్వునవ్వి "బీబీ, నీ కాకాంక్ష అపరిమితముగానున్నదే !"

"జహాపనా ! ఈ దాసిజేసిన తప్పిదమేమి ?"

"ఢిల్లీపాదుషాను నీ దాసునిగ జేసుకొంటివి. అదిచాలక యింకనూ బహుమానమును గోరుచుంటివి ?"

లుత్ఫున్నీసా నవ్వి "స్త్రీలకు ఆకాంక్ష మెందు ?" అన్నది.

"మరల ఇప్పుడేమి కోరదలచితివి ?"

"ముందు ఈ దాసి మనవి చిత్తగింతునని పాదుషావారభయమీయవలయును."

"అందువలన ఢిల్లీశ్వరుని రాచకార్యముల కాటంకము కలుగరాదు."

"అందువలన రాచకార్యముల కెట్టి యాటంకమును కలుగనేరదు."

"అయిన నీకోరిక ఏమైనదీ చెప్పుము ?"

"మరల వివాహము చేసుకొందును."

జహంగీరు పకపకా నవ్వి, "నీకోరిక చాలా ఉత్కృష్టమైనది. సంబంధ మెచట నిశ్చయమైనది ?"

"నిశ్చయమైనది. పాదుషావారు అనుమతించవలయును. జహాపనా సమ్మతించనియెడల స్థిరపడదు."

"ఇందుకు నాహుకుముతో అవసర మేమున్నది ? ఏ భాగ్యవంతుని సుఖసాగరమున దేల్ప దలచితివి ?"

"ఢిల్లీశ్వరుని సేవించుచున్నంతమాత్రమున ఈ దాసి ద్విచారిణి కాదు. తన స్వామినే తిరిగి వివాహమాడ నిశ్చయించుకున్నది."

"యథార్థముగనే? అయిన నీ ఈ పాత భృత్యుని ఏమిచేసెదవు?"

"ఢిల్లీశ్వరి యగు మెహరున్నిసా కప్పగించి పోయెదను."

"ఎవ్వరీ - ఢిల్లీశ్వరి మెహరున్నిసా?"

"అవబోయెడివారు!"

మెహరున్నిసా ఢిల్లీశ్వరి యగునన్న విశ్వాసము లుత్ఫున్నిసా కున్నట్లు జహంగీరు పాదుషా గ్రహించెను. తన ఆశ విఫలమయిన కారణముననే రాజపరివారమునుండి వైదొలగ నిశ్చయించుకున్నదని తెలుసుకొనెను. ఇందువలన జహంగీరు మనస్సున కొంత విచారము చెలరేగక పోలేదు.

"శహన్‌షాహాకు ఈ సంబంధ మిష్టమున్నట్లు లేదు?"

"ఇష్టము లేక కాదు."

"నీ భర్తనే మరల ఇప్పుడు వివాహమాడవలసిన అవసర మేమిగలిగినది?"

"కాలవశమున నాస్వామి నన్ను వివాహమాడి పత్నిగా స్వీకరించి కారణాంతరమున విడిచిపుచ్చెను. ఇపుడు పాదుషా ఈదాసిని విడువలేకున్నారు!"

పాదుషా నవ్వి గంభీరముగ "ప్రేయసీ, నేను నీకివ్వలేని దేమున్నది. నీఇష్టమెటులనో అటులనే కానిమ్ము. కాని నన్ను విడిచిపుచ్చి యేల పోవలయును. ఆకసమున సూర్య చంద్రు లిరువురును సంచరించుటలేదా? ఒక్కరెమ్మనే రెండుపూలు పూయుటలేదా?" అనెను.

లుత్ఫున్నీసా నేత్రములు పెద్దవిగ జేసుకొని పాదుషా వైపు జూచుచు "ఒకరెమ్మను రెండుపూలు చిన్నవి పూయును. గాని ఒక నాళమున రెండు పద్మము లుద్భవింపవు. అట్టియెడ రత్నసింహాసనముకడ కంటకమునై నే నేల యుండవలయును ?" అని తన మహాలువైపుగా వెళ్ళిపోయినది. ఇప్పుడిట్టి వాంఛ తనకేల కలిగినదీ జహాంగీరునకు తెలుపలేదు. అనుభవమూలకముగ తెలుసుకొగలిగినంత తెలుసుకుని జహాంగీరు మనస్సున సరిపెట్టుకొనెను. వాస్తవమైన ఆమె అంతర్గతాభిప్రాయమును గ్రహించలేకపోయెను. లుత్ఫున్నీసా హృదయము వాస్తవముగ పాషాణ సదృశము. రమణీమణుల మోహపెట్టగల రాజలాంఛనములుగూడ ఆమె మనసును లోభపెట్టలేవు. కాని ఈసారి ఆ పాషాణములోకూడ ఏదో క్రిమి ప్రవేశించినది.

## 20

లుత్ఫున్నీసా తన మహాలుకు తిరిగివచ్చి పేశ్మనును పిలచి ఉల్లాసముగా తన వేషమును మార్చుకున్నది. ఒంటినున్న స్వర్ణభూషణముల నొక్కొక్కటి తీసిపెట్టి "వీటినన్నిటిని నీవు బహుమతిగా తీసికొమ్ము!" అన్నది.

పేశ్మను విస్మితయై "బహుమతి ! ఇంత కిమ్మతుగల బహుమతి ! అసలు విషయ మేమి ? ఇవాళ విశేషమేమిటి ?"

"శుభ సంబంధమే !"

"అవును. నేను అట్లనే అనుకున్నాను. ఏమి, మెహరున్నీసా భయము తీరిపోయినదా ?"

"దూరమైపోయినట్లే. ఇప్పు డామె విషయములో నాలో ఆలోచ నేమియు లేదు."

పేశ్మన్ అతి ఉల్లాసముగ "అయితే నేనిప్పుడు చక్రవర్తినికి ప్రధాన సహచారిణినన్నమాట!"

"నిజముగా నీకు, చక్రవర్తినికి ప్రధాన సహచారిణివి కావలయునను కోరిక ఘట్టిగా ఉన్నచో తప్పక నీగురించి మెహరునీ్నసాకు సిఫార్సు చేయుదును."

"మెహరు – బేగ మగుట అసంభవమని మీరేగదా చెప్పియున్నారు?"

"నే నామాట చెప్పియుండలేదు. ఆవిషయములో నా కిప్పు డెట్టిచింతా లేదంటిని."

"ఏల చింతించరు? మీరేగనుక ఆగ్రాకు ఏకమాత్రా ధీశ్వరిగాకున్న అంతయు వ్యర్థముగదా !"

"ఆగ్రాతో నే నిప్పు డెట్టి సంబంధము పెట్టుకొనుట లేదు."

"నా కేమియు అర్థమగుట లేదు. ఈ విషయము శుభ సంబంధ మెట్లగును?"

"ఔను, ఇది శుభసూచకమే యగును. ఈ జీవిత మందు మరల ఆగ్రా ప్రవేశించకుండ వెడలిపోవుచున్నాను."

"ఎక్కడకు పోయెదరు ?"

"వంగదేశమునకుపోయి నివసింతును. వీలయినచో ఒక యోగ్యునియింట గృహిణినై జీవింతును."

"ఇది వినుటకు చమత్కారముగనే యున్నది. కాని మనస్సు వికల మగుచున్నది."

"చమత్కారము గాదు. నిజముగనే ఆగ్రా వదలి వెళ్ళుచున్నాను. పాదుషావారి సెలవుకూడ పుచ్చుకున్నాను."

"ఈ దుర్బుద్ధి మీ కేల కలిగినది?"

"దుర్బుద్ధిగాదు. చాలకాలమునుండి ఈ ఆగ్రాలో సంచరించితిని. చిన్నతనమునుండి సుఖము లనుభవించవలయు నను ఆశ మెండుగా యుండెడిది. ఆకారణముననే వంగదేశము నుండి యింత దూరము వచ్చి ఎంతగానో ధనము ఖర్చుపెట్టి తిని. ఎన్నో కూడనిపనులు చేసితిని. యేది ఆశించి యింతగా నొనర్చితినో అది ఫలించలేదు. కాని మిక్కుటమగు ఐశ్వర్యము, గౌరవము, ప్రతిష్ఠ, అధికారము అనుభవించితిని. దానివలన నేమైనది? వెనుకటి సంగతు లన్నియు తరచి చూచుకున్న నే ననుభవించినది యథార్థమగు సుఖముగాదు. నా మనమందుగల తృష్ణ తీరలేదు. నాకు తృప్తి కలుగలేదు. ఆశ మిక్కుటమైనది. ఈ నా ఆశ పర్వత శిఖరములయం దుద్భవించు నదిని పోలియున్నది. మొదట నదీజలము తన జన్మస్థానమగు పర్వతశ్రేణిపైనుండి సన్నని కాలువగ నిర్మలోదకముతో ప్రవహించ నారంభించి అనేకారణ్యములను, జానపదములను దాటుచున్నది. పోనుపోను అంతకంతకు వెడల్పగుచున్నది. ప్రవహించునప్పుడు ఆనదికి కలకలమను రవముగూడ గలుగుచున్నది. ఈ ధ్వని నదీ ప్రారంభమున లేకున్నను తన గర్భమున యిముడ్చుకొనియే యున్నది. వెడల్పు యినకొలది ఆ నిర్మలత పోయి మలిన మగుచున్నది. మధ్య

మధ్య అనేక సైకత ప్రదేశము లేర్పడుచున్నవి. పోయిన కొలది వేగము తగ్గుచున్నది. నీటి రుచికూడ మారుచున్నది. అక్కడనుండి తిన్నగా అపారమగు పారావారమున యిన్ని విలక్షణములతో ఎందులకుకలియుచున్నదో ఎవరుచెప్పగలరు?

"ఇదంతయు నాకే మర్థమగుట లేదు. ఇంతకూ మీ రేల సుఖముగా నుండుటలేదు?"

"ఏల సుఖముగా నుండుటలేదో యిప్పటికి తెలసికొన్నాను. మూడు సంవత్సరము లీ అంతఃపురములో నుండి గూడ యనుభవించని సుఖము ఒక్కనాడు ఉత్కలమునుండి తిరిగివచ్చు త్రోవలో ఒకరాత్రి యనుభవించితిని. అప్పుడే గ్రహించితిని!"

"ఏమని గ్రహించితిరి?"

"నే నిన్ని రోజులనుండి హైందవ దేవతా మూర్తివలె నున్నానని. అది నానావిధములగు రత్నఖచిత స్వర్ణాభరణములు తొడిగిన పాషాణము. ఇంద్రియ సుఖము నాశించి అగ్నిచుట్టూ తిరుగుచున్నాను. కాని దానిస్పర్శ నాకెప్పుడును గాలేదు. ఈనాటికి వెదకిచూడ పాషాణ సదృశమగు నా శరీరమున రక్తనాళములు అంతఃకరణమున గలసియున్నట్లు కనుపించినవి."

"ఇదికూడ నా కర్థమగుటలేదు."

"నేను ఈ ఆగ్రా పట్టణములో ఎప్పుడైన ఎవరినైన ప్రేమించియున్నానా?"

"ఎవరినీ ప్రేమించి యుండలేదు ?"

"ఆ పరిస్థితులలో నేను పాషాణ హృదయనేల కాను ?"

"యిపుడు ప్రేమించవలెనన్న అభిలాష యున్న యెడల అటులనే ఏల ప్రేమించరాదు ?"

"హృదయమునం దటులనే తలచితిని. అందువలననే ఆగ్రా విడిచిపెట్టిపోవుచున్నది."

"ఇంతమాత్రముననే ఆగ్రా విడిచిపెట్టి పోవలయునా ? నీవు ప్రేమించదగ్గ వానికొరకై దూరదేశమునకు పోవలయునా ? ఆగ్రాయందట్టి మానవుడే లేడా? నిన్ను ప్రేమించు వారిలో ఒకరినైననూ నీవు ప్రేమించదగదా ? రూప, యౌవన ఐశ్వర్యములందు ఈకాలమున ఢిల్లీశ్వరుని మించిన వా రెవ్వరున్నారు ?"

"ఆకాశమున సూర్యచంద్రులు స్థిరముగా ప్రకాశించుచున్నారు. కాని అచట నిలువక జలము అధోగామిని యగుచున్న దేల ?"

"నేనే ఆప్రశ్న నిన్నడుగుచున్నాను."

"లలాట లిఖితమగు భాగ్యము !"

లుత్ఫున్నీసా విషయమంతయు ఆమెకు విడమర్చి చెప్పలేదు. పాషాణ హృదయమున అగ్ని ప్రవేశించినది. పాషాణము ద్రవించసాగినది.

## 21

విత్తనము భూమియందు నాటి వదలిన అది తనంతట తానే మొలకెత్తి పెరుగుచున్నది. అది ఎప్పుడు ఎట్లు మొలకెత్తుచున్నదీ తెలియదు. కాని ఎవరైన ఒక విత్తనము నాటి విడచిన వారెక్కడనున్నను అది మొలకెత్తి చిగిర్చి మొక్కయి వృక్షమయి ప్రమానగుచున్నది. మొలకెత్తినపు డది కనుపింపదు. అప్పుడు దానిలక్ష్యమే ఎవ్వారికీ నుండదు. కొంచెము కొంచెముగ నెదిగి, జానెడు - మూరెడు - బారెడైనప్పటికీ దాని సంగతి ఎవ్వరికిని పట్టదు. ఈవిధముగ రోజులు వారములు నెలలు కొన్నిసంవత్సరములు గడచును. అప్పటికీ మనదృష్టి దానిమీదకు మళ్ళదు. అది పెద్ద వృక్షమై దాని నీడను పెరుగు పైరుపంటలకు హాని కలుగజేయును. ఆనీడ నింకొక మొక్కను పెరుగనివ్వదు. తానొక్కటిగ పెరుగవలయునని దాని మతము.

ఇదేవిధముగ లుత్ఫున్నిసా ప్రణయము వృద్ధిబొందినది. అకస్మాత్తుగా తన ప్రణయమూర్తిని కలుసుకున్నది. అప్పు డామె తన మనస్సులోని ఆకాంక్షను తెలిసికొనలేకపోయినది. ఆమె మనమున ప్రణయాంకురమయినది. కాని మరల ఆతని దర్శనము గాలేదు. ఆమె మనోనేత్రమున కెప్పుడును అతనిరూపము బొడగట్ట జొచ్చినది. దానివలన ఆమె కొకింత ప్రియము కలుగజొచ్చినది. అతని మూర్తిని తన మనమున చిత్రించుకున్నది. మానవులు మానసికముగ ఏవిషయమున దృఢమగు చింత గలిగియుందురో ఆవిషయమున ఆనాటి కానాడు ఆకాంక్ష మెండగుట లోక సహజము.

లుత్ఫున్నీసా తన మనమందా మూర్తిని దృఢమనస్కయై ధ్యానించుచున్నది. అందువలన ఆతని దర్శనమునకై మిక్కుటముగ ఆరాటపడుచున్నది. నానాటికి ఆమె కా కోరిక దుర్నివార్యమైపోయినది. దానిముందు ఆమెకున్న ఢిల్లీ సింహాసనాకాంక్షకూడ అంత విలువైనదిగ కనుపించలేదు. ఆ సింహాసనము కేవలము మన్మథశరానలజ్వాలాభూయిష్టమని నిశ్చయించుకున్నది. రాజ్యము - సింహాసనము - రాజధాని ఒకవేల సర్వము విసర్జించి ప్రియ సందర్శనార్థ మామె బయలుదేరినది. ఎవరామె ప్రియుడు? ఆమె ప్రియుడు నవకుమారుడు!

ఈకారణముచేతనే లుత్ఫున్నీసా, తన యాశలన్నియు మెహరున్నీసావలన వమ్మయి పోవుచున్నవని ఎరిగియు విచారపడలేదు. ఆగ్రాకువచ్చి తన సంపదను రక్షించుకొనుటయందుకూడ లక్ష్యముంచలేదు. మీదుమిక్కిలి ఈకారణమును పురస్కరించుకొనియే పాదుషావద్ద శాశ్వతముగ సెలవు పుచ్చుకొని వచ్చినది.

లుత్ఫున్నీసా సప్తగ్రామమునకు వచ్చి రాజబాటకొకింత దవ్వుగ నొక మేడయందు ప్రవేసించినది. సుశోభితముగ నలంకరింపబడి దాసదాసీజనసంచలనమువలన ఆమేడ ఆకస్మికముగ చూచువారల కాశ్చర్యము గొలుపుచుండెను. అందలి ప్రతిగదియు చిత్ర విచిత్రముగ, సుగంధద్రవ్య, పుష్పద్రవ్యములతోడను - వెండి, బంగారు, తదితర దంతసామాగ్రితోడను అలంకరించబడి యున్నవి. ఇట్లతిసుందరముగ నలంకరింపబడిన యొకగదియందు అధోముఖియై లుత్ఫు

న్నిసా కూర్చొని యున్నది వేరొక ఉన్నతాసనముపై నవ కుమారు డాసీనుడై యుండెను. ఆమె లోగడ నొకటి రెండు పర్యాయము లీసప్తగ్రామమునకు వచ్చి నవకుమారుని దర్శించి పోయినది. అందువలన ఆమె కెంతవరకు తృప్తి కలిగినదో ముందు సంభాషణవలన తెలియగలదు.

కొంతసేపటివరకు మౌనమువహించి నవకుమారుడు "ఇక నేను వెళ్ళుచున్నాను; ముందెప్పుడు నన్ను పిలువనంప వలదు."

"కొంచెముసేపుండుము. నేను చెప్పదలచుకున్న దింకనూ చెప్పలేదు."

నవకుమారు డక్కడ మరల కొంతసేపు కూర్చొని ఆమె ఏమి చెప్పునో యని నిరీక్షించెను. కాని ఆమె నోట మాటేమియు రాలేదు. "నీవేమి చెప్పదలచితివి?" అని నవకుమారు డామె నడిగెను. లుత్ఫున్నిసా జవాబేమియు ఇవ్వకుండగనే యేడువసాగినది. అది చూచి నవకుమారుడు లేచి నిలువబడి బయలుదేరి వెళ్ళబోయెను. లుత్ఫున్నిసా అతని పైబట్ట పుచ్చుకొని నిలిపినది. అతడు కొంత విరక్తిజెంది "ఏమిటి? ఏమి చెప్పదలచితివో అదిచెప్పరాదా!" అనెను.

"మీకుగల కోరికయేది? యీ ప్రపంచమునందు మీరు కోరదగిన దేదియునులేదా? ధనధాన్యములు, కీర్తిప్రపత్తులు, రాగము, అనురాగము, ఇంకను భూమిపై సుఖప్రదములైన ఏవస్తువులు కావలయునన్నను యిచ్చెదను. వాటికి ప్రతిఫలముగా మిమ్ములనేదియు కోరను. కేవలము మీదాసిగా నంగీ

కరింపుడని కోరుచున్నాను. మీ ధర్మపత్నిగా నయ్యెడు యోగ్యత నాయందులేదు. కేవలము దాసిగా నుండ నంగీక రింపుడని కోరుచున్నాను.''

''నే నొక బీద బ్రాహ్మణుడను. ఈ జన్మమున కిట్లనే యుండనిమ్ము. యవనీజారుడనై నీ విచ్చు నైశ్వర్యమువలన సుఖ భోగము లందలేను.''

యవనీజారుడా ! అనగా ఆమె తన భార్యయని ఇంత వరకు నవకుమారుడు గుర్తించలేదు. లుత్ఫున్నీసా ఆ మాట విని అధోముఖియైనది. నవకుమారు డామెచేతినుండి తనబట్టను విడిపించుకొనెను, కాని మరల దానినందుకొని లుత్ఫున్నీసా "పోనిండు విధాత నా నుదుట అట్లనే వ్రాసియున్నచో నా చిత్తవృత్తినే విడనాడెదను. ఇక నేను దేనినీ కోరనుగాని మీ రీత్రోవనే పోవుట తటస్థించినప్పుడెల్ల నా కొకింత దర్శనమిచ్చిపొండు. కేవలము మిమ్ముచూచియైన తృప్తి పొందెదను.''

"నీవు యవనస్త్రీవి. మీదుమిక్కిలి పరకాంతవు. నీతోడ నే నీవిధముగ సంభాషించుటగూడ మర్యాదగాదు. ఇకముందు నేనిచటకు రాజాలను.''

ఆమె మెదలకుండ ఉండిపోయినది. ఆమె మనమందు తుఫానుచెలరేగినది. చాలవరకు కదలక మెదలక రాతివిగ్రహామువలె ఉండిపోయినది. చివరకతని కొంగువిడచి "అయిన వెడలిపొండు'' అనెను.

నవకుమారుడు బయలుదేరి నాల్గడుగులు ముందుకు వేయగనే విరచుకొని, చాపచుట్టగ అతని పాదములపైబడి కరుణాపూరితముగ "నిర్దయుడా! నీ కొరకై నేను ఆగ్రా సింహాసనాధిపత్యమునుగూడ త్యజించి వచ్చితిని. అట్టినన్ను విసర్జించకుము."

"తిరిగి నీవు ఆగ్రాకే వెళ్ళిపొమ్ము నాయందు ఆశ వదలుకొమ్ము."

"వింటినుండి బలముగా వదలిన బాణమువలె లేచి నిలచి, లుత్ఫునీసా "ఈ జన్మమున వదలజాలను" అనుచు కనుబొమలు పెద్దవిజేసి, దర్పముతోగూడి రారాజునుగూడ మోహింపజేయగల చూడ్కులు నవకుమారుని మోముపై నిలిపెను. ఒక్కంతసేపటిక్రింద కఠిన హృదయములగూడ ద్రవింపజేయుగల హృద్భావముగల ఆమెలో అంతలో, ఏ అజేయ మానసికశక్తి భారతరాజ్యశాసనాకల్పనకుకూడ జంక కుండెడిదో, ఆ జ్యోతి మరల పొడచూపసాగినది ఆమె నేత్రములు సముద్ర జలరాశిపై ప్రసరించు సూర్యకిరణ ప్రకాశమువలె విరాజిల్లుచున్నవి. అప్పు డామె ముఖ మతిశోభాయమానముగ నుండెను. గాని అంతలో ఆదర్పము ప్రణయ భావమున దుర్బలమైపోయినది. ఆమె శరీరము వణక సాగినది. ఇంచుమించు ఉన్మాదావస్తను బొందియున్నట్లున్న ఆ యవన జవ్వని అతనివైపు తీవ్రముగ జూచి "ఈ జన్మమున వదల జాలను. నీవు నావాడవై తీరవలెను!" అని నొక్కి చెప్పినది.

ఆ కుపిత స్త్రీమూర్తిజాడ జూడ నవకుమారుని కించుక భయము కలుగక పోలేదు. లుత్ఫున్నీసా తన అనిర్వచనీయ దేహ పాటవమును నేడు చూపగలిగిన ట్లిదివర కెన్నడూ చూపలేదు. ఆ శోభ, విద్యుల్లేఖ చూచుట కెంతో యింపుగా నుండియు ఎంత భయము గలిగించునదియై యుండునో, అట్లుండెను. నవకుమారుడు వెడలిపోవ నుంకించునంతలో నతని మనమున తటాలున నొక తేజోమూర్తి స్ఫురణకు వచ్చెను. వెనుక యొకప్పుడు తనభార్యయగు పద్మావతిపై కోపముగలిగి శయనాగారమునుండి ఆమెను బయటకు పంప నుద్యుక్తుడాయెను. ఆమె అప్పటికి పన్నెండు సంవత్సరముల వయస్సుననున్నను దర్పముతో అతని నెదిరించి నిలచినది. అప్పటి ఆమె నేత్రములుగూడ యిదేరీతిని ప్రజ్వరిల్లినవి. ఆ ముఖమందలి రేఖలుగూడ ఇప్పు డీమె ముఖమందువలె విప్పారి శోభనుగూర్చినవి. ఆమె శరీరముగూడ యిటులనే కంపించినది చాలరోజులనుండి ఆమూర్తి ఈతని మనస్సునకు గోచరించుటలేదు. నేడది జ్ఞప్తికివచ్చినది. ఆమె మూర్తియే నే డీమెయందు ప్రతిబింబించిన ట్లతనికి తోచుచుండెను. సంశయగ్రస్తుడగు నవకుమారుడు మెల్లని స్వరముతో "నీవెవ్వతెవు?" అని యడిగెను.

ఆమె నేత్రముల నింకనూ విస్ఫారితములుగ జేసి "నేను పద్మావతిని!" అని అతని ప్రతివచనమునకుగూడ ఎదురు జూడక లుత్ఫున్నీసా లోనికి వెడలిపోయినది. నవకుమారుడుగూడ రిచ్చవడి అనుమానముతోడనే యింటికి తిరిగి వెళ్ళెను.

# 22

అట్లు తొందరగ వెడలిపోయిన లుత్ఫున్నిసా వేరొక గదియందు ప్రవేశించి లోన గడియవైచుకొని రెండుదినముల వరకు బయటకురాక అందేయున్నది. ఈ రెండు దినముల లోను ఆలోచించి తనముందు కర్తవ్యమును నిర్ణయించుకుని స్థిరప్రతిజ్ఞ చేసుకున్నది. సూర్యాస్తమయసమయమువరకు వేచియుండి, పేశ్మన్ సహాయముతో వేషధారణ మొనర్చినది. స్త్రీధారణోపయోగ్యములయిన వస్త్రభూషణములేమియు ధరించలేదు. అద్దముముందు నిలచి తన విచిత్రమైన ఆ వేషమును చూచుకొని "ఏమే పేశ్మన్, ఇప్పుడు నన్నెవరైన గుర్తించగలరా?" అని అడిగినది.

"ఎట్లు గుర్తించగలరు?"

"అయితే నేను వెళ్ళుచున్నాను. నాకు తోసటగ నెవ్వరును రానవసరములేదు."

పేశ్మన్ కొంచెము భయముతో "మేముచేసిన అపరాధ మేమి? దాసిని క్షమించిన మిమ్మొకమాట అడిగెదను."

"ఏమని?"

"ఈ వేషధారణము- ఇటుల బయలుదేరుటయందు మీా యుద్దేశ్యమేమి?"

"కేవలము కపాలకుండలను ఆమెపతినుండి శాశ్వతముగ విడదీసి వారి సంబంధవిచ్ఛేదము గావించుటకు. అటు పైన నవకుమారుడు నావాడగును."

"బీబీ, మీరు ఆవేశములో చక్కగా ఆలోచించ లేదనుకొందును. వెళ్ళవలసినది దట్టమగు అడవిమధ్యనుండి. చీకటి దట్టముగ వ్యాపించినది. ఒంటరిగ మీరు ఒక్కరు...!"

"లుత్ఫున్నీసా ఆమె కేమియు జవాబివ్వకుండ ఇల్లు వెడలి సప్తగ్రామమున నిర్జన ఉపవనప్రాంత మావలగల నవ కుమారుని యింటివైపుగా పయనమై నడచినది. అక్కడకు వెళ్ళకముందుగనే చీకటి నలుమూలల బాగుగా గమ్మినది. ఆతని యింటి సమీపమున ఒక చిట్టడవి కలదని యిదివరకే తెలిపియుంటిమి. లుత్ఫున్నీసా ఆ వన ప్రాంతమునకు వచ్చి ఒక చెట్టు మొదట గూర్చుండి తాజేయుదలచివచ్చిన దుష్కృత్యమునుగూర్చి తలపోయసాగినది. దానికితోడు తల వని తలంపుగ ఆమెకు తనకార్యసాఫల్యమునకు సహాయము గూడ లభించినది.

ఆమె అచటనే ఆచెట్టుమొదట కూర్చుండియున్నది. ఇంతలో ఆ అరణ్యమునుండి ఉచ్చకంఠస్వరమేదో వినవచ్చి నది. వెంటనే ఆమెలేచి నిలువబడి నలువైపుల తేరిపార చూచెను. కొంచెము దూరమున దీపపుకాంతి ఆమెకు పొడ గట్టినది. లుత్ఫున్నీసా సాహసమున పురుషులకన్న మిన్న. ఆమె లేచి వెలుగు కనుపించువైపుగా నడచినది. అల్లంత దూరమునుండి చెట్టుచాటుజేసికొని అటువైపు జూచినది. ఆమె కటు పొడగట్టినది హోమమునుండి ప్రజ్వరిల్లుమంట. ఆమెకు వినిపించినది మనుష్యకంఠము— మంత్రోచ్చారణము. ఆ మంత్రోచ్చారణ సందర్భమున ఆమెకు వినిపించినది తా నెరిగిన ఒక వ్యక్తి నామము. అ నామమువిని వెంటనే బయట

బడి ఆ యజ్ఞమొనర్చి యాతని ముందుకుబోయి కూర్చు న్నది.

ఆమె నటు గూర్చుండనిండు. చాలకాలముగ కపాల కుండల వృత్తాంతము మనము వినలేదు. ఇక ఆమె సమా చారము విచారించ అవసరమైయున్నది.

## 23

ఆనాడు లుత్ఫున్నీసా ఆగ్రాకు వెడలి మరల నిట్లి పుడు సప్తగ్రామమునకు వచ్చువరకు ఈమధ్య సంవత్సరము గడచిపోయినది. కపాలకుండల నవకుమారుని గృహిణియై గూడ సంవత్సరము దాటినది. ఆనాటి సాయంతమున లుత్ఫు న్నీసా అరణ్యమున ప్రవేశించువేళకు కపాలకుండల పరధ్యాన ముగ తన పడకగదియందు గూర్చుని యున్నది. పూర్వము సముద్రతీరమున అలంకార విహీనయై తల విరియబోసుకొన్న కపాలకుండలవలె నేటి ఈ కపాలకుండల లేదు. శ్యామసుందరి వచించినట్లు స్పర్శమణియోగమున ఆయోగిని యిప్పుడు గృహిణియైనది. సంస్కారరహితమై పిరుదులదిగువవరకు గల ఆమె కేశరాసి, ముచ్చటగొలుపు వేణీరూప మును బొంది శోభాయమానముగ నున్నది. తలకట్టు ముడు చుటయందుగూడ చాతుర్యము గనబడుచున్నది. ఇందు శ్యామసుందరి వేణీరచనాకౌశల్యము పొడగట్టుచున్నది. సువాసనలు వెదజల్లు పుష్పములుగూడ జడయందు తురుమ బడినవి. వెనుకటివలె ముంగురు లామెముఖమును క్రమ్ము కొనుటలేదు. ఆమెకు ధరింపజేసిన యాభరణము లామె

శరీరచ్ఛాయయముందు వెలవెల బోయినను శోభనుగూర్చు చున్నవి. ఆమె ధరించిన శ్వేతాంబరము ఆమెశరీరమున కెంతయు అనువుగానున్నది. శ్వేతమేఘావృతాకాశమున ప్రకాశించు పూర్ణచంద్రునివలె ఆమె ముఖమండలము ప్రకాశించుచున్నది. శ్యామసుందరిగూడ ఆమెదరిని కూర్చుని యున్నది.

"అన్నగా రింక యిట నెన్నిదినము లుందురు?" అని శ్యామసుందరిని కపాలకుండల యడిగినది.

"రేపటిదినము పయనమై వెళ్ళుదురు. నేడు రాత్రి వేళ ఆయోషధిని తెచ్చియుంచిన దానిమూలమున మావారి అనుగ్రహమును సంపాదించుకొందును. క్రితము రాత్రి బయటకు వెళ్ళినందులకే అన్నగారు కోపగించినారు. ఈనాడెట్లు వెళ్ళగలను!"

"ఈరోజు పగలే ఏల పోరాదు!"

"పగలు తెచ్చిన దాని ఫలిత మేముండును? సరిగా రెండు జాములవేళ తీసుకురావలయును. ఈ సంగతి మా యన్నతో చెప్పియుంటిని. ఆతడు విని యూరకున్నాడు."

"అట్లయిన నేడు నేను పగటివేళ అద్దానిని పోయి చూచివచ్చి, రాత్రికి పోయి తెచ్చి యిచ్చెదను. నీకు ఇల్లు గదల పనిలేదు నేనొక్కదానినే పోయి వచ్చెదను."

"నిన్న నొక్కనాడు పోయివచ్చినందులకే యిద్దరము పడిన చీవాట్లు చాలు. నీవు రాత్రికి వంటరిగ పోవలదు."

"అందుకు భయపడవలదు. చిన్నతనమునుండియు ఒంటరిగ అడవియందు దిరుగు నభ్యాస మున్నది నాకు. ఆ అభ్యాసమే లేకయున్న నే డిట్లు నే నీ యింటియం దుండెడి దాననే కాను."

"అందువలన గాదు. సంసారు లొంటరిగ యిల్లువిడచి తిరుగు టంత మంచిదిగాదు. నిన్న యిరువురము పోయినందు లకే చీవాట్లు తింటిమి. ఇక నీ ఒక్క తెవు పోయిన యేమైన గలదా?"

"అందువలన గలుగు నష్టమేమి? రాత్రివేళ ఒంటరిగ బయటకు పోయినందున దుశ్చారిణి నగుదునని భయపడు చున్నావా?"

"నే నా విధముగ తలచుటలేదు. లోకులు తేలికగ మాట్లాడుదురు."

"మాట్లాడనిమ్ము. అంతమాత్రమున నేను జెడ్డ దానను కాను."

"నీ వట్టిదానవు కావని నాకు తెలియకగాదు. అల్లు లెవ్వరైన ని న్నట్టిమాట లనిన నాకు గష్టముగ నుండును."

"అట్టి అన్యాయపుమాటలు విని నీవు బాధపడవద్దు." అని కపాలకుండల సాదరముగ శ్యామసుందరిని జూచుచు "ఒక వేళ నా ఈ చర్యవలన వారికి మనస్సున కష్టము కలిగిన నే నేమిచేయగలను? వివాహమువలన స్త్రీల కిట్టిదాస్యము కలుగు నన్నసంగతి దెలిసియున్న, నేను వివాహ మాడియే యుండెడి దానను గాను." అని కపాలకుండల యన్నది.

అందుపై మాట్లాడుట కేమియు తోచక శ్యామసుందరి ఇంటిపనులు నిర్వర్తించుకొనుటకుగాను లోనికి బోయినది. కపాలకుండలయు తనకున్న పనులు నెరవేర్చుకొని ఓషధి వెదకి తెచ్చునిమిత్తము ఇంటినుండి బయలుదేరినది. అప్పటికి జాము ప్రొద్దుపోయినది. వెన్నెల గాయుచున్నది. నవకుమారుడు ముంగిట మెల్లాయందు గూర్చుని యుండెను. కపాలకుండల బయటకు పోవుటను చూచి కూర్చున్న చోటునుండి చప్పున లేచిపోయి ఆమెచేయి పట్టుకొనెను. కపాలకుండల ఆగి "యెందుల" కనెను.

"ఒంటరిగ నెటకు బోవుచున్నావు?" నవకుమారుని కంఠధ్వనియందెట్టి తిరస్కార భావమును లేదు.

"శ్యామసుందరి యొక మూలిక గోరినది. దాని సహాయమున ఆమె భర్తను వశీభూతుని జేసికొనదలచినది. నే నా ఓషధిని వెదుక బోవుచున్నాను."

"నిన్న నొకసారి పోయియుంటివిగదా? మరల నీ రో జేల పోవలయును?"

"నిన్న నది కానుపింపలేదు. నేడు మరల వెదకి తేబోవుచున్నాను."

"పగలేల బోగూడదు?" అతని కంఠము మృదువుగా ప్రేమపూర్వకముగ పలికినది.

"పగటిపూట తెచ్చిన ఆయోషధి పనిచేయదు."

"నీ కెందుల కింత శ్రమ. దానిపేరు చెప్పగూడదా? నేను తెచ్చి యిచ్చెదను."

"దానిని చూచి గుర్తింపగలను. కాని దానిపేరు నాకు తెలియదు. అది పురుషులు తెచ్చిన పనిచేయదు. స్త్రీ లెవరైనను తలవిరియబోసికొని త్రవ్వి తీసుకొని రావలయును. పరుల కుపకారము చేయు తలంపుతో బోవు నన్నేల ఆటంక పెట్టెదరు ?"

బొమలు ముడివడ కపాలకుండల ఈ మాట లనెను. నవకుమారు డింక నామె నేమియూ ప్రశ్నింపక "నేనుకూడ నీ వెంట వచ్చెదను నడువు" మనెను.

"రండు. నే నేదేని దుర్నడత గలిగియుంటినని మీకు సంశయమున్న జూడవచ్చును." అని కపాలకుండల తీవ్ర స్వరమున బలికినది. దానిపై నవకుమారు డేమియు బలుక నేరక ఆమె చేయివిడచి ఇంటిలోనికి పోయెను. కపాలకుండ లయు అరణ్యాభిముఖముగా వెడలిపోయినది.

## 24

సప్తగ్రామమునకు చాల సమీపముగనే నిర్జనా రణ్యము గలదని యిదివరకే తెలసికొని యుంటిమి. ఓషధి వెదకు నిమిత్తము కపాలకుండల ఒంటరిగ సంకీర్ణారణ్య మునకు బోయినది. ప్రశాంతముగ, నిస్తబ్ధముగ నున్న ఆ వెన్నెలరాత్రి అతిమనోహరముగ నున్నది. ఆకసమున చంద్రు డప్పుడప్పుడు తెల్లని మేఘముల దాటుచు భూమిపై తన చల్లని కిరణజాలమును వెదజల్లుచుండెను. అప్పుడప్పుడు పక్షులు రెక్కలల్లార్చెడి శబ్దము వినిపించుచున్నది. దూరమున ఊరకుక్కలు మొరిగినశబ్దము, ఎండుటాకులపై అడపదడప

సర్పములేవేని పరుగులెత్తు చప్పుడుకూడ వినవచ్చుచున్నది. శరీరమునకు సుఖమును గలిగించు చల్లనిగాలి వీచుచున్నది. ఆ చిరుగాలికి చెట్లకొమ్మ లించుక కదలుచున్నవి. ఈ వాతావరణమంతయు ఆమెకు పూర్వానుభూతిని జ్ఞప్తికి తెచ్చుచుండెను యిసుకతిన్నెలపైన జుట్టు విరియబోసికొని సముద్ర తరంగములపైనుండి వచ్చు చల్లని పిల్లవాయువుల ననుభవించుచు ఉల్లాసముగ తా నెట్లు కాలముగడపినది ఆమె స్మృతి పథమున లీలగా మెదలసాగినది. ఈ ఆలోచనములతో అన్యమనస్కయై ఆమె గమ్యస్థానములేక ముందుకుపోసాగినది.

తా నిట్లు దేనినిమిత్తమై ఎచటకుబోవుచున్నదియు ఆమె ఆలోచించుటలేదు. పోనుపోను అడవి మరింతదట్టమై మార్గము దుర్గమ మగుచున్నది పోయినకొలది చెట్లు దగ్గరదగ్గరగనుండుటచే చంద్రకాంతి నాటంకపరచుటవలన ఒక్కసారిగ చీకటి ఆవరించినది. అప్పటికి తన ఆలోచనలనుండి తేరుకొని ఇక ముందుకుపోవ సరియైనత్రోవ లేదని తెలిసికొన్నది. అట నిలుచబడి నలుమూలల పరికించిచూడ నొకమూల నేదో వెలుతురగుపించినది. లుత్ఫున్నీసానుకూడ నాకర్షించిన దీవెలుతురే. చిన్ననాటి అభ్యాసమువలన అప్పుడామె కెట్టిభయమును కలుగలేదు. మీదుమిక్కిలి ఆమెకు కుతూహలము జనించినది. మెల్లమెల్లగా అడుగులువైచుకొనుచు ఆవైపుగాపోయి చూడ ఆమెకెవ్వరును కనుపించలేదు. ఆ వెలుతురున్నతావునకు దాపుగా పాడుబడిన ఇల్లొకటి కనుపించినది. అక్కడ చెట్లు దట్టముగ యుండుటచే మొదట ఆ యిల్లు కనుపింపలేదు. యిటుకలతో గట్టిన ఆ చిన్నయింటినుండి ఎవరో మాట్లాడు

చుండుట వినవచ్చినది. ఆ మాటలు వినవలెనను కుతూహల ముతో కపాలకుండల మెల్లగా ఆ గృహముకడకేగి పొంచి యుండి ఇరువురు మనుష్యు లేదియో సంభాషించుచున్నట్లు గ్రహించినది. వారు మాట్లాడుకొనునదేమియు అర్థముగాక సాంతము విననిర్ణయించుకుని సావధానయై వినసాగినది—

వారిలో మొదటియాతడు:- నా అభీష్టము మృత్యువై యున్నది. అది నీకిష్టముకానియెడల నో బ్రాహ్మణకుమా రుడా ! నేను నీకెట్టిసహాయము చేయజాలను. నీవుకూడ నా కేమియు సహాయము చేయనవసరములేదు."

రెండవ:- "నే నేమియు శుభమును కాంక్షించుట లేదు. జీవితాంతమువరకు శాశ్వతముగ ఈమె నాకడ్డురాకుం డనుండుటయే నేను కోరుచున్నది. కాని ఈమెను నా చేతి మీదుగా హత్యచేయ నొల్లనుకాని, ఆ పని మీరేచేయదల చిన నేనెట్టి ప్రతికూలాచరణమును జేయను."

మొదటివాడు :- " ఒట్టి అమాయకునివలె నున్నావు. నీకు కొంత జ్ఞానోదయము కలుగజేయవలయును. శ్రద్ధగా వినుము. అతి రహస్యమగు సంగతి చెప్పెదను వినుము. ఎచటనో మనుష్యశ్వాసము వినవచ్చుచున్నది. ముందు బయటకుపోయి నలుమూలలా పారజూచి రమ్ము.

యధార్థముగ కపాలకుండల వారి మాటలను శ్రద్ధగా వినవలయునని సమీపముగ వచ్చి, ఆతురతగా నున్న సందర్భ ములో మయిమరచి గట్టిగా శ్వాస విడచినది. మొదటివాని మాట ప్రకారము రెండవవాడు లేచివచ్చి కపాలకుండలను

కనుగొనెను. కపాలకుండలయు బ్రాహ్మణవేషధారియగు నతనిని చంద్రప్రకాశమున కనుగొన్నది. కాని అతని ఉనికి వలన సంతోషించవలయునో భయపడవలయునో నిర్ణయించుకోలేకపోయినది. ఆ వచ్చిన యతడు ధోవతి కట్టుకొని, ఉత్తరీయముచే నొడలంతయు కప్పుకొని యుండెను. అత డతి కోమల నవయవ్వనాకారుడుగ కనుపడుచుండెను. అతని ఆకారము చూచుట కతి రమణీయముగ, సుందరముగ నున్నది. స్త్రీలవలె సౌందర్యగర్వము గూడ కొంచె మున్న ట్లగుపించినది. అతని జుట్టు పురుషులకువలె సంస్కరింప బడక స్త్రీల తలకట్టువలె దీర్ఘముగ పెరిగియున్నది. ముఖము విశాలమైనది. నుదు రెత్తుగా నున్నది. విశాలములగు నేత్రము లందు విద్యుద్దీప్తి ప్రకాశించుచున్నది. చేతియందొక చిన్న కైజాగుకూడ యున్నది. అత డింత సౌందర్యరాశిగ కనుపించుచున్నను, ఏదో భీషణభావ మామె కతనియందు కనుపించినది. ఆ కారణమున కపాలకుండల కించుక భీతి కలుగక పోలేదు. ఇంచుకసేపు ఒకరినొకరు చూచుకున్నమీదట ఆగంతుకుడు "నీవెవ్వరవు?" అని ఆమె నడిగెను. ఈ ప్రశ్నయే ఒకసంవత్సరము క్రిందట నెవ్వరైన ఆమె నడిగి యున్న వెంటనే నదురుబెదురులేక జవాబిచ్చి యుండెడిది గాని, ఇప్పు డీమె 'గృహలక్ష్మి' స్వభావము గలిగియున్నందున వెంటనే సూటిగా జవాబివ్వలేకపోయినది. అదచూచి ఆ బ్రాహ్మణ కుమారుడు గంభీరస్వరమున "కపాలకుండలా! ఇంతరాత్రివేళ ఈ భయంకరాటవికి ఎందునిమిత్తము వచ్చితివి?" అని యడిగెను.

ఒక రాత్రించరుడగు అజ్ఞాత యువకుని నోట తన నామోచ్చారణ విని కపాలకుండల ఆశ్చర్యమునంది మాటాడ లేకపోయినది. అతనికి జవాబుకూడ ఇవ్వలేదు.

బ్రాహ్మణకుమారు డదిజూచి మరల "నీవు మా సంభాషణము నేమైన వింటివా ?"

అంతలో కపాలకుండల కొంత తేరుకొని అతని ప్రశ్నకు జవాబివ్వకుండ ధైర్యముగ తాను తిరుగ ప్రశ్నించి నది. "నేనుగూడ నిన్నదే యడుగుచున్నాను. ఈ నిశి రాత్రివేళ, ఈ భయంకరాటవి మీ రేమి దురాలోచన చేయుచున్నారు ?"

బ్రాహ్మణకుమారుడు కొంతవరకు చింతానిమగ్నుడై ఆమె కేమియు జవాబివ్వలేదు. ఆలోచింపగా మనమున కేదో ఒక నూతన అభీష్టసిద్ధియగు ఆలోచనతట్టి, కపాల కుండల చేయి బుచ్చుకొని ఆయింటికి దూరముగ తీసికొని పోవసాగెను అదిజూచి కపాలకుండలకు మిక్కుటమగు కోపము గలిగి గట్టిగా విదలించి తనచేతిని విడిపించుకొనెను బ్రాహ్మణకుమారు డప్పుడు ఆమెచెవిదగ్గర మృదుస్వరమున "సంశయింపకుము. నేను పురుషుడను గాను!" అనెను.

కపాలకుండలకు ఈమాట విన్నమీదట మరీ ఆశ్చ ర్యము కలిగినది. ఆ బ్రాహ్మణవేషధారిమాటయం దామెకు నమ్మకము కలుగనూలేదు, నమ్మకపోనూలేదు. కాని ఆమె ఆ బ్రాహ్మణవేషధారి వెంట నడచినది. వా రిరువురు ఆపాడు బడిన యింటికి దూరముగ బోయినంతనే ఆవేషధారి కపాల

కుండలతో "మేమాలోచించు ఆ దురాలోచనను వినిపించె దను. అది నిన్నుగూర్చినదే."

కపాలకుండలకు ఆగ్రహము, భయముగూడ గలిగినది. ఆమె ఆఛద్మవేషితో "చెప్పుము, విందును." అన్నది.

"అట్లయిన నేను తిరిగి వచ్చువరకు నీ విందే యుం డుము." ఆ వేషధారి ఆపాడుగృహమునకు తిరిగిపోయెను. కాపాలకుండల కొంతసేపటివరకచటనే వేచియుండెనుకాని, తా నచట విన్నది, చూచినదిబట్టి పూర్తిగా భయపడిపోయి నది. ఆఛద్మవేషధారిణి త న్నచట ఎందునిమిత్తము కూర్చొ నమన్నది తెలియదు. ఒకవేళ తన యభీష్టమును నెరవేర్చు కొనుటకే త న్నచట విడచి వెళ్ళినదేమో? ఎవరు చెప్ప గలరు. కపాలకుండల భయముచే విహ్వలమైపోయినది. ఛద్మవేషిణి ఎంతసేపు చూచినను వచ్చుటలేదు. కపాల కుండల ఇంక నచట ఉండలేకపోయినది. ఇంటివైపు అతి త్వరితముగ నడువసాగినది.

ఆసమయమున ఆకసమున కారుమేఘములు క్రమ్ము కొనసాగినవి. అరణ్యమున యిదివరకు ప్రసరించియున్న చంద్రకాంతికూడ సన్నగిల్లినది. అందుమూలమున కపాల కుండలకు ప్రయాణమందించుక యాలస్య మగుచున్నది. సాధ్యమగునంత త్వరితముగనే నడువసాగినది. చాలాపర్యా యము లామెకు ఎవరో త న్ననుసరించి వచ్చుచున్నట్లు పద ములధ్వని వినవచ్చినది. శబ్దమయినప్పుడెల్ల ఆమె వెనుదిరిగి చూచుచుండెడిది. కాని ఆ అంధకారమున ఆమెకెవ్వరును

కనుపించియుండలేదు. ఆ బ్రాహ్మణవేషి యేమైన తన్నను సరించి వచ్చుచున్నాడేమోనని కపాలకుండల తలచినది. అప్పటి కామె దుర్గమారణ్యముదాటి ఊరినంటియున్న చిట్టడవిని ప్రవేశించినది. ఇప్పుడచట వెనుక నున్నంత యంధకారము లేదు. ఎదుట చూచుట కొకింత వెలు గున్నదిగాని, ఆమె కెవరునూ కనుపించలేదు. మరింత వేగముగ యింటివైపు నడక సాగించినది. మరల ఆమె వెనుక ఎవరో నడచివచ్చుచున్న పదధ్వని వినిపించినది. ఆకాశమున మరింత దట్టముగ కారుమేఘములు క్రమ్ముకొని చీకటి భయంకరముగ వ్యాపించినది. ఆమె వేగమును మరింత హెచ్చించి తన గృహ సమీపమువకు వచ్చునంతలో భూ నభోంతరాళములు దద్దరిల్లున ట్లొకసమున ఉరుముచు కుంభ వృష్టి ప్రారంభమైనది. ఆమె పరుగిడసాగినది. ఆమె ననుస రించి వచ్చు వ్యక్తియు పరుగిడుచున్నట్లు వినవచ్చినది. ఆమె వస్త్రములు పూర్తిగ తడిసి నీళ్ళు కారుచున్నవి. కపాల కుండల ఎట్టకేలకు ఆత్మరక్షణ జేసికొని ఇంటి ప్రాంగణమును జేరి లోని వసారావరకు బోయినది. ఆమెకొరకింటిద్వారము తెరువబడియే యున్నది. ద్వారముదాటి లోనికిబోయి తలుపు మూయుట కిటువైపు తిరుగగా ద్వారము బయట నొక దీర్ఘ కాయుడగు మనుష్యమూర్తి నిలువబడియుండుటామెకు గోచ రించినది. ఆ సమయముననే ఆకసమున ఒక మెరుపుతీవె ప్రాకి పోయినది. ఆ వెలుతురందు ఆ వ్యక్తి సముద్రతీర వాసియగు కాపాలికుడని కపాలకుండల గుర్తించగలిగినది.

# 25

తలుపు బిగించి కపాలకుండల మెల్లమెల్లగా పడకగది లోనికి బోయి తన మంచముపై పరుండినది. మానవ హృదయము సముద్రమువలె అనంతము- అగాధము. అందు ప్రబల వాయుతాడనము వలన తరంగము లెన్నెనియు చెలరేగును. కాని వాటిని లెక్కింప నెవ్వరికిని సాధ్యముగాదు. కపాలకుండల మనమున గూడ నట్టి కల్లోలమే చెలరేగినది ఆ రాత్రియంతయు ఆమెకు నిదుర బట్టలేదు. ఆమె కంటికి మాటిమాటికి గాలికి చిందరవందరయై వర్షమువలన తడిసిన జటాజూటధారియైన కాపాలికుడు కనుపింప సాగెను. అందుపై పూర్వపు స్మృతి గలిగి వెనుకటి సంగతుల నన్నిటిని కపాలకుండల జ్ఞప్తికి తెచ్చుకొనసాగినది. సముద్రతీరారణ్యమున కాపాలికుని ఆ భైరవీ పూజలూ, అందునిమిత్తమై అతడు చేసిన పైశాచిక కృత్యములు, నవకుమారుని బంధించుట, ఆ సమయమందు తా నెట్లు ప్రవర్తించి పారిపోయి వచ్చినది, ఈ విషయము లన్నియు జ్ఞప్తికి రాసాగినవి ఆమె శరీరము వణకసాగినది. ఆ రాత్రి జరిగిన ఘటన లన్నియు ఆమె మనోనేత్రమునకు బొడగట్టసాగినవి. శ్యామసుందరి నిమిత్త మోషధి తే బయలుదేరుట, నవకుమారుని నిరోధము, తన తిరస్కారము, అరణ్య ప్రవేశము, చంద్రకిరణ ప్రసారితమగు అ వ్వనశోభ, ఆపైన అంధకారము, తదుపరి కాపాలికుని దర్శనము- అన్నియు ఒక్కటొక్కటి కంటికి కట్టిన ట్లగుపించ సాగినవి.

కోడికూతవేళ కొంత కపాలకుండలకు నిదురబట్టినది. ఆమె అందొక చిన్న స్వప్నము గన్నది. ఒక అందమైన చిన్న నావ నెక్కి తాను సముద్రముపై పోవుచున్నది. దానిపై కాషాయవర్ణముగల జెండా ఎగురుచున్నది. పుష్ప మాలాలంకృతులగు కొందరునావికులు రాధాకృష్ణుల అనంత ప్రణయగీతికలను పాడుచూ దానిని నడుపుచుండిరి పడమటి కనుమలపై అస్తమించుచున్న సూర్యునికిరణకాంతి బంగారు పూతవలె ప్రకాశించుచున్నది. ఆకాశమునందు చిందరవంద రగనున్న చిన్నచిన్న మేఘము లా స్వర్ణకాంతియందు స్నానమాడుచున్నవి. సాంతముగ నలుమూలల చీకటులు గ్రమ్మినవి. సూర్యచంద్రు లగుపించుట లేదు. ఆ మేఘములెచ టికిపోయినవి? నావికులకుగూడ దిక్కులు తెలియుటలేదు. ఏవైపుగాపోవలయునో ఎరుగకుండిరి. ఎట్టకేలకు నావను త్రిప్పిరి. వారిపాటల నాపివేసిరి. మెడలయం దలంకరించు కొనిన పూలమాలలను తీసివేసిరి. పతాకము ఊడిపోయి నీటిలోపడి మునిగిపోయినది. సాగరమున తాటిప్రమాణమున అలలు చెలరేగినవి. ఆ తరంగముల నడుమనుండి కాపాలికుడు తన వామహస్తమున నావనుబట్టుకొని సముద్రమున ముంచు యత్నముననుండెను. ఈ సమయమున కా బ్రాహ్మణవేష ధారి యచట ప్రత్యక్షమై "నావను ముంచమందువా, లేక నిన్ను రక్షింపమందువా!" యనెను. కపాలకుండల అప్ర యత్నముగ "ముంచు" మనెను. వేషధారి నావను విడిచి వేసెను. నావకూడ మాట్లాడసాగినది. "నేనింక భారమును మోయజాలను, పాతాళమునకు బోయెదను." అనుచు నావ నీటిలోమునిగి పాతాళమునకు పోయినది.

స్నానమాడినవిధముగ వంటినిండ చమటలు బట్ట కపాలకుండల స్వప్నమునుండి తేరుకున్నది. బయటచూడ అప్పుడే సూర్యోదయమగుచున్నది. తెరచియున్న గవాక్ష ద్వారముగుండ వసంతవాయువులు వీచుచున్నవి. గాలి కల్లలలాడు కొమ్మలపైనుండి పక్షులు కలకలారావములు జేయుచున్నవి. గవాక్షముపై వనలతలు ఆక్రమించుకొని పుష్పించియున్నవి. వాటితీగెలు కిటికీగుండ లోనికి వ్రేలాడు చున్నవి. అవి గాలికి కదలినప్పుడెల్ల చక్కని పరిమళమును గదినంతయు వెదజల్లుచున్నవి. నారీస్వభావవశమున కపాల కుండల కిటికీలోనికి ప్రాకిన లతనొకదానిని లాగినది. అందుండి ఏదేని ఒక వ్రాతకాగితము క్రిందపడినది. కపాలకుండల దాని నెత్తి చదివినది. అది ఒకఉత్తరము. అం దిట్లున్నది.

“నేడు చీకటిపడినతరువాత నిన్నటిరాత్రివలెనే ఆ బ్రాహ్మణకుమారుని కలుసుకొనుము. నీవు నీవిషయమున ప్రయోజనకారియగు ఏ సంగతినిగూర్చి తెలుసుకొనగోరి యుంటివో అది వినగలవు. ఇట్లు, బ్రాహ్మణవేషి”.

# 26

ఆనాటి సంధ్యాసమయమువరకు కపాలకుండల బ్రాహ్మణవేషధారిని కలుసుకొనుటా ? మానుటా ? యన్న విషయమునే మనన జేయుచున్నది. ‘ఒక సంసారిణి ఒంటరిగ రాత్రి నిర్జనప్రదేశమున పరపురుషునితో మాట్లాడుట నింద్య మగునా, కాదా?’ అన్న విషయముపై ఆమె ఏ నిర్ణయము నకు రాలేకపోయినది. చెడ్డ ఉద్దేశ్యముతోగాకుండ కలసి

కొన్నప్పుడు అది హానికర మెట్లుగాదో, స్త్రీతో స్త్రీ - పురుషునితో పురుషుడు కలసిమెలసి మెలంగుట ఎట్లు దోషము గాదో, అట్లే స్త్రీ పురుషులుకూడ కలసి మాట్లాడుకొనుట దూష్యము కాదని ఆమె అభిప్రాయము. అయిననూ ఆ బ్రాహ్మణవేషి పురుషుడు కాదు. అది యిప్పు డనవసరము. ఆమె సంకోచమల్లా ఆ బ్రాహ్మణవేషిని కలసికొనుటవలన తనకు శుభమగునా కాదా యన్నదే.

మొదట ఆ బ్రాహ్మణవేషిని కలుసుకొనుట, తదుపరి కాపాలికుని దర్శనము, ఆ వెనుక దుఃస్వప్నము. ఈ సంఘటనలన్నియు కపాలకుండలకు భయమును కలుగజేసినవి. అమంగళము కలుగనున్నదని ఆమె సందేహించుటకు ముఖ్యకారణము కాపాలికుని ఆగమనము. బ్రాహ్మణ బాలకుడుకూడ చెప్పినది వారు మాట్లాడుకొనుచున్నది తన విషయమేనని. బ్రాహ్మణవేషి కాపాలికునకు సహాయకారియై యుండుట తెలసికూడ అతనిని కలసికొనుట, తనంతట తానే ఆపత్తును కోరి తెచ్చుకొనుట యగును. రాత్రి స్వప్నమందు ఈ వేషధారి తన్నుద్ధరించెదనని వచ్చియున్నాడు. ప్రత్యక్షమునగూడ నట్లే గనపడుచున్నది. బహుశః ఆ విషయములనే మాట్లాడుటకు నన్ను రమ్మని యుండవచ్చును.

"స్వప్నమం దీతనితో తాను నావను ముంచమని చెప్పినది యిప్పు డీతడు సహాయముజేయుదు నన్న వలదనవలయునా ! అది సరిగాదు. భక్తవశంకరిణి యగు భవానీదేవి కృపవలన స్వప్నమం దాదేశించినది గావుననే బ్రాహ్మణవేషధారి కనుపించి తన్నుద్ధరింతుననెను. అతని

సహాయ మక్కరలేదనిన తనకు తప్పక ముప్పు వాటి ల్లును." అనుకొని కపాలకుండల ఆతని కలసికొనబోవుటకే నిశ్చయించుకొనెను.

తెలివిగలవారిట్టి సిద్ధాంతము చేయుదురా? యన్నది వేరువిషయము. అట్టి తెలివిగలవారలతో యిచట ప్రమేయ మేమియు లేదు. కాని కపాలకుండల వయస్సున చిన్నది తెలివిగా ఆలోచించియుండదు. నవయవ్వన విలాసినివలె ఆలోచించినది. అర్ధరాత్రివేళ జటలు విరియబోసు కొని కాపాలికపాలితయగు సన్యాసివలె సిద్ధాంతీకరించినది. దీపకాంతిని జూచి భ్రమించు శలభమువలె నిర్ణయించు కొన్నది.

సూర్యాస్తమయానంతరము యింటిపనులన్నియు చక్క పెట్టుకొని కపాలకుండల గడచిన రాత్రివలె అరణ్యమునకు బయలుదేరునప్పుడామె గదియందలిదీపమును హెచ్చించివచ్చి నది. గాని ఆమె గదివెలుపలకువచ్చినంతనే అది ఆరిపోయినది. బయలుదేరుటకుముందామె ఒక విషయమును మరచిపోయి నది. ఆవేషధారి అరణ్యమునందు తన్నెక్కడ కలసికొమ్మ న్నది మరచిపోయినది. దానికొరకామె మరల ఉత్తరము చదుకోవలసివచ్చినది. వెనుకకు తిరిగి వచ్చి ఆమె వుత్త రమునకై చూచినది. గాని అది తానుంచినచోట కనుపింపలేదు. తల దువ్వుకొనునప్పు డద్దానిని కొప్పులో నుంచుకున్నట్లు జ్ఞప్తికి వచ్చినది. వేళ్ళు జొనిపి కొప్పులో వెతకినది. అది కనుపింపలేదుగాని ఆమెకొప్పు వీడిపోయినది. జుట్టు విరియబోసికొన్నది. ఇంటిలో చాలాసేపు వెతకి

దారకక విసుకెత్తి నిన్నటి ప్రదేశముననే కలసికొనవచ్చు నని బయలుదేరి వెళ్ళినది. ఊడిపోయిన కొప్పు ముడివైచు కొనవలయునన్న ఆలోచనయే ఆమెకు లేకపోయినది. చిన్న నాటి సముద్రతీరవాసి యగు కాపాలికరక్షిత కపాలకుండల వలెనే నేడునూ ఉన్ముక్తకేశయై ప్రయాణమై వెళ్ళి పోయినది.

# 27

సంధ్యవేళ కపాలకుండల గృహకృత్యములు నిర్వ ర్తించుచున్నప్పు డెప్పుడో ఆమె కొప్పులో దాచుకున్న ఉత్తరము జారి పడిపోయినది. ఆమె కాసంగతి తెలియలేదు. అదిచూచిన నవకుమారు డామెకొప్పునుండి ఉత్తర మట్లు జారిపడుట కాశ్చర్యపడెను. కపాలకుండల బయటి పని చూచుకొనబోయినతరువాత యాతడాఉత్తరమును చదివెను. అది చదివినమీాదట అతనికి ఒక్క ఆలోచన మనస్సునకు స్ఫురించినది. "నిన్న నేది వినగోరితివో నే డాసంగతిని విన దవా ?" ఆవిషయమేమి ? ప్రణయసంబంధమా ? ఆబ్రా హ్మణవేషధారి ఎవరు ? అతడు మృణ్మయికి ఉపపతియా ? గడచినరాత్రి విషయము తెలియక నవకుమారు డిట్లు అపోహ పడజొచ్చెను.

సతీ సహగమనార్థము పేర్చిన చితి నెక్కినపుడు దానినుండి వచ్చు ధూమముచే మొదట కనులదృష్టి సన్న గిలుచు, తదుపరి చిన్న చిన్న మంటలులేచి శరీరమునకు తాకి అచటచట బొబ్బలెక్కును. ఆపిమ్మట అగ్నిజ్వాల

లాకసమంతఎత్తున లేచి శరీరమునంతను దహించును. నవ కుమారుని అవస్థకూడ ఇపు డటులనే యున్నది. లేఖ చదువు నప్పు డాతనికి మొదట నేమియు నవగతము గాలేదు. తరువాత అనుమానము కలిగినది. ఆమీద నాయనుమానము స్థిరపడి నది. అందుమూలమున అతని మనస్సు దహించుకొని పోవుచున్నది. మానవ హృదయ మొక్కసారి సుఖాధి క్యతనుగాని, దుఃఖాధిక్యతనుగాని సహింపజాలదు. నిదా నముగ ననుభవించవలెను. మొట్టమొదట నవ కుమారుని పొగ చుట్టవేసినది. అటుతరువాత అగ్నిశిఖ అతని హృదయమున తాపము గలుగజేసినది. ఆ మీదట అతని హృదయము భస్మమైపోసాగినది. ఇంతకుముందు కపాలకుండల ఏయే విషయములందు తన్ను తిరస్కరించినది జ్ఞప్తికి దెచ్చుకొనెను. ఇప్పు డామెను తాను నిషేధించినను ఆమె కిష్టమువచ్చినట్లు స్వేచ్ఛగా బోవుచున్నది. అయినప్ప టికి నవకుమారు డెప్పుడును, ఆమె ఒంటరిగ రాత్రిపూట బయట సంచరించినను సందేహించలేదు. కాని నేడు ఈ పత్రాధారముగా వెనుకటి సంగతులను అన్వయించుకొని ఆమెను సందేహించుచున్నాడు.

కొంతవడి కా ఉద్వేగము చల్లారినతదుపరి నవకుమారు డేకాంతముగ గూర్చుండి ఏడ్వసాగెను. అశ్రుదృష్టి ఉపశమి ల్లిన తదుపరి అతని కొకింత మనస్థిమిత మేర్పడినది. అత డాలోచించి తన ముందు కర్తవ్యమును నిర్ణయించుకొనెను. ఆనా డతడు కపాలకుండలతో నేమియు బలుకలేదు. నే డతడు కపాలకుండల ననుసరించిపోయి అరణ్యమునం దామె యొన

రించు పాపమును ప్రత్యక్షముగ చూచి ప్రాణములను విడువ నిశ్చయించుకొనెను. అంతకన్న వేరుమార్గ మాతనికి కనుపింపలేదు.

ఇట్లు నిశ్చయించుకొని యాతడు గవాక్షముగుండ కపాలకుండల పోవు సమయముకొరకు పెరటిమార్గమున కనిపెట్టుకొని చూచుచు కూర్చొనియుండెను. ఆమె బయలుదేరి పోవుట చూచి ఆమె ననుసరించి బయలుదేరెను. ఇంతలో ఆమె వెనుదిరిగి వచ్చుటజూచి తా నామెకు గనుపింపకుండ దాగియుండెను. కొంతవడి కామె మరల బయలుదేరి పయన మయ్యెను. నవకుమారుడుగూడ మరల బయలుదేరునంతలో ద్వారమువద్ద నాతని నొక దీర్ఘకాయు డడ్డగించెను.

కపాలకుండల విషయముననే మనస్సు లగ్నమై యున్నందున నవకుమారునిదృష్టి కా వ్యక్తి ఆలోచనయే పట్టలేదు. తనదారి కడ్డునిలచిన యాతని ఛాతిపై బలముగ గ్రుద్ది పో నుంకించెను గాని, ఆత డేమియు చలించకపోవుట చూచి నవకుమారుడు "ఎవరు నీవు ? నా దారి కడ్డముగాక తొలగి పొమ్ము" అనెను.

"ఏమి ! నన్ను గుర్తించలేదా ?" అని ఆ వ్యక్తి పలికిన సముద్రపు హోరునుమించిన యాతని కంఠధ్వని విని పరీక్షగ ఆతని ముఖమువైపు చూచెను. ఆత డెవరు ! పూర్వ పరిచితుడు, సముద్రతీరవాసియగు కాపాలికుడు. నవకుమారుడు ఆశ్చర్యపడెను గాని భయపడలేదు. అతని ముఖమున నొకింత ప్రసన్నత కానవచ్చినది. మన

స్సాకింత కుదుటబడ "కపాలకుండల మిమ్ము చూడవలె ననియా బోవుచున్నది?" యని యడిగెను.

"లేదు"

అతని మనమున వెలిగిన ఆశాజ్యోతి ఆరిపోయినది. అతని ముఖమున మరల వెనుకటి ఆ కారుమేఘము లలము కొన్నవి. "అట్లయిన నా త్రోవ కడ్డములెందు" అని తీవ్రముగ ననెను.

"అటులనే త్రోవ విడిచెదను. గాని నీతో కొన్ని మాటలాడవలయును. ముందు వాటిని వినుము."

"మీకు నాతో మాటలాడవలసిన అవసరమే మున్నది? మీరు మరల నా ప్రాణములను హరింపవచ్చి తిరా? అయిన తీసికొనుడు. ఈతడవ మిమ్ముల నేమియు నిరోధించను. మీరు కొంచె మాగుడు. నేనిప్పుడే వచ్చెదను. నేను దేవీ సంతుష్టికొరకేల ప్రాణత్యాగము చేయగూడదు? నా ప్రాణములను రక్షించిన యామెయే నాకు కష్టము గలిగించినది. నా మాటలు విశ్వసింపుము. ఇప్పుడే తిరిగివచ్చి ఆత్మ సమర్పణ చేసికొందును."

అందుపై కాపాలికుడు "నే నిప్పుడు నిన్ను వధించుటకు రాలేదు. భవానీదేవి కది యిష్టముగాదు. నే నేపని జేయదలచివచ్చితినో అది నీ కనుమోదముగనే యుండును. లోనికి నడువుము. నేను చెప్పునది సాంతముగ విందువుగాని."

"ఇప్పుడు వినలేను. నా కవసరమగు పని యున్నది. పోయి అది తీర్చుకొని ఇప్పుడే వచ్చెదను. అప్పు డంతయు సావధానముగ విందును."

"కుమారా! నే నంతయు నెరుగుదును. నా వెంట నిన్ను నే నచటికి తీసికొనివెళ్ళెదను. నీ వెద్దానిని చూడదల చితివో దానినే చూపించెదను. కాని ముందు నే జెప్పునది వినుము. భయపడవలదు."

ఇప్పు డింక మీావలన నాకెట్టి భయమునులేదు. రండు అని నవకుమారుడు కాపాలికుని వెంటబెట్టుకొని యింటిలోనికి బోయి కాపాలికుని కొక ఆసనముజూపి తానొక దానిపై గూర్చుని "ఇక శలవిండు" అనెను.

# 28

ఆసనముపై కూర్చున్న తదుపరి కాపాలికుడు తన రెండు చేతులను బయటపెట్టి నవకుమారునకు జూపెను. అవి విరిగిపోయి యున్నవని అతడు తెలసికొనెను. నవకుమారుడు కపాలకుండలాసహితముగ ఏనాడుపలాయితుడై వచ్చెనో నాటి రాత్రి వారి నిరువురను వెదకికొనుచు నొకసైకతగిరిశిఖర మెక్కి-యటనుండి క్రిందకు బడెను. అట్లు పడునప్పుడు శరీరమునకు దెబ్బ తగులకుండుటకు చేతులు మోపుచేయ నవి విరిగిపోయి నవి. ఆసంగతినంతయు నవకుమారునకు దెలుపుచు "భూమిపై పడినంతనే చేతులుమాత్రము విరిగిపోయినవిగాని శరీరమున కెచటను దెబ్బ తగులలేదు. క్రింద పడినతోడనే మూర్ఛ బోయితిని రెండు రాత్రులు, ఒక పగ లట్లున్న తరువాత గాని నాకు తెలివిరాలేదు. ఆమగతలో నేనొక కలగంటిని.

అందు భవానీదేవి చెప్పిన విషయములు వినిన నాకు శరీరము గగుర్పొడిచినది.”

“భవానీదేవి నన్నా స్వప్నమందు వెన్నుజరచి ‘ఓరీ దురాచారుడా! మనస్సునందు మాలిన్యము నుంచుకొని నన్ను పూజించుటవలననే నీ ఆరాధనకు విఘ్నము కలిగినది. ఇంతవరకు నీ విం|్రదియ లాలసతకు వశీభూతుడవై ఆ కన్య రక్తముతో నాపూజ జరుపక కాలము గడపితివి. అందు వలన ఆకన్యద్వారానే నీ పూర్వపుణ్యమంతయు నాశనమై నీకిట్టి దశపట్టినది. నేనిప్పుడు నీ పూజలను గ్రహింపజాలను” అన్నది. అందుపై నే నామె పాదములపై పడి ఏడ్చుచు అనేకరీతుల ప్రార్థించితిని. చిట్టచివరకు ఆమె కరుణించి ప్రసన్నమై దాని కొరకే ఒక మార్గము అనుగ్రహించినది.

“భద్రా! దీని కొరక ప్రాయశ్చిత్తమున్నది. ఆ కపాల కుండలనే నాపాదములమ్రోల బలినొసంగుము. ఎంతకాలము వరకు ఆపని నీవలనగాదో అంతవరకు నన్ను పూజింపవలదు.” అని చెప్పినది.

“నా కప్పటిలో ఎన్నిదినములకు స్వస్థత జిక్కినది జెప్పుట అనవసరము. నా కారోగ్యము గలిగినది మొదలు దేవీకార్యసాఫల్యమునకై ప్రయత్నించుచున్నాను. నా చేతులం దిప్పుడు పూర్తిగా బలము పోయినది. అందువలన నా ప్రయత్నమునం దింకొకరి సాయము నాకు కావలసి యున్నది. ఈనాటి ప్రజలకు ధర్మమునం దాసక్తి తక్కువ గదా? మీదుమిక్కిలి మ్లేచ్ఛుడు రాజ్యపాలకుడగుటచేతను ఈ కార్యమున కెవరు సాహసించి సాయపడుదురు. చాలా

ప్రయత్నముజేసి యిప్పటికి ఈ పాపిష్టురాలి ఉనికి తెలిసికొంటిని. కాని నా బాహువులందు వెనుకటి దార్ఢ్యత లేనందున ఆదేవి యాజ్ఞను పరిపాలింప జాలకుంటిని. కేవలము మానస శుద్ధికొరకే హోమాదికృత్యములు నిర్వర్తించుచున్నాను. నిన్నరాత్రి మాత్రమే కపాలకుండలను ఆబ్రాహ్మణకుమారుని కలసి మాట్లాడుచుండగా చూచితిని. నేటిరాత్రి కూడ ఆమె అతని కలసికొనుటకే పోవుచున్నది. చూడదలచితివేని నావెంట రమ్ము." కుమారా! కపాలకుండల వధార్హ. నేను భవానీదేవి ఆజ్ఞానుసార మామెను వధించెదను. ఆమె నీపట్లగూడ విశ్వాసఘాతకి యయ్యెను. గాన సంకోచింపకుండ వధించవచ్చును. ఆ అవిశ్వాసినిని నా యజ్ఞస్థానమునకు తీసికొనిరమ్ము. నీచేతులమీదుగనే భవానీప్రీతికై ఆమెను వధింపుము. అందువలన ఆమె భవానిపట్ల జేసిన అపచారమునకు ప్రాయశ్చిత్త మగును. దానివలన నీకు శుభమగును. విశ్వాసఘాతకికి దండన యగును. అని కాపాలికుడు పూరకొనెను

నవకుమారు డేమియును మాట్లాడలేదు. కాపాలికుడడిచూచి- పద! ముం దిప్పు డామెను నీకు చూపించెదను.

నవకుమారుని శరీరమున ముచ్చెమటలు పోసినవి. అత డేమియు పలుకకుండ కాపాలికునివెంట నడచెను.

## 29

కపాలకుండల అడవియందు ప్రవేశించి మొట్టమొదట ఆ పాడుపడిన యింటిని చేరుకొని ఆ బ్రాహ్మణ కుమారుని

కలసికొనెను. పగతైనచో అతని ముఖము కుంచించుకొని యుండుట గుర్తించి యుండెడిది. ఆమెనుజూచి అతడు "కాపాలికు డిచటకు రాగలడు. మన మిచట మాట్లాడు కొను టంత మంచిదిగాదు. అటు దూరముగ బోవుదము రమ్ము." అని బ్రాహ్మణవేషి కపాలకుండలను అరణ్య మధ్యమున చుట్టునూ చెట్లచే నావరించి మధ్య విశాలమగు ప్రదేశముగలచోటికి దీసికొని పోయెను. వా రిరువు రచట గూర్చున్నతరువాత అత డామెతో "మొదట నే నెవరైనది తెలుపుదును. తరువాత నామాట లెంతవరకు నమ్మదగినవో ఆలోచించుకొనుము. హిజలీనుండి నీవు నీ భర్తవెంట వచ్చు నప్పుడు దారిలో రాత్రి ఒక యువతి నిన్ను చూడవచ్చినది. జ్ఞాపకమున్నదా ?

"నా కాభరణములిచ్చిన యామెయా ?"

"ఔను, ఆమెను నేనే."

కపాలకుండలకు మిక్కిలి ఆశ్చర్యము కలిగినది. ఆమె విస్మయమునుజూచి లుత్ఫున్నిసా "దాని కేమి, అంతకన్నను ఆశ్చర్యకరమగు విషయ మింకొకటి యున్నది వినుము. నేను నీ సవతిని !"

కపాలకుండల మరింత విస్మయముతో "అదెట్లు ?" అని అడిగినది. లుత్ఫున్నిసా తనవివాహము, సకుటుంబ యాత్ర, జాతి భ్రష్టత, పతిచే పరిత్యాగము, మరల సప్త గ్రామమున చేరి పతిని గలుసుకొనుట మొదలగు తన గత చరిత్ర నంతయు, ఆమీాద తా నీ అరణ్యమున కాపాలికుని

కలసికొనుట మున్నగు సంగతుల నన్నిటిని ఆమె కాకళింపు జేసినది.

"అయిన నీ వేయుద్దేశముతో బ్రాహ్మణవేషమున నన్ను కలసికొంటివి?"

"నీకు శాశ్వతముగా పతివియోగము గల్పించుటకు."

కొంతసేపాలోచించి "నీకోర్కె నెట్లు సాధించగలవు?" అని కపాలకుండల యడిగినది.

"ముందు ప్రాణేశ్వరుడు నీ శీలమును శంకించునట్లుగ జేసితిని. అందువలన నా కోరిక నెరవేరదని ఆ మార్గమును విడచితిని. ఇప్పుడు నేను చెప్పినట్లు నడచుకుందు శేని, నా కార్యము సఫలమగును. నీకును శుభమగును."

"కాపాలికునినోట నీవు విన్న దెవరి పేరు?"

"నీ నామమునే వింటిని. అతడు నీపేరుమీదనే, నీకు మంగళముగోరియో, అమంగళముగోరియో హోమము జేయుచున్నాడు. అది తెలసికొను నిమిత్తమే ఆయనకు నమస్కరించి ఎదుట పూజపూర్తియగువరకు కూర్చునియుంటిని. అనంతరము నీ నామముచ్చరించి హోమము జేయుట యందలి యుద్దేశమేమని యడిగితిని. అతనిమాటలను బట్టి నీ కమంగళముతలచియే అత డట్లు చేయుచున్నట్లు గ్రహించితిని. నాకోరికయు నదియే యగును. ఆసంగతి కాపాలికునకు తెలియ పరచితిని. మేము పరస్పరము సహాయముజేసికొనుటకు స్థిర పరచుకొంటిమి. అంత నతడు విపులముగా నాలోచించు కొందమని నన్నా పాడు యింటిలోనికి తీసికొనిపోయెను.

అచట అతడు తన మనమందున్న యాలోచన నాతో చెప్పెను. నీ మృత్యువునే అతను కోరుచున్నది. నీ మరణము వలన నాకెట్టి ప్రయోజనమునులేదు. నే నీ జన్మమున ఎట్టి పాపము జేసినను, ఇట్టిపాపము నెన్నడును చేయలేదు. నిరప రాధియగు ఒకబాలిక ప్రాణములు తీయుటకు నేను సమ్మతింప లేదు. ఈ సమయమునకే నీ వచటికి వచ్చియుంటివి. నీవుకూడ ఆ మాటలను కొన్నిటిని వినియుందువు!"

"కేవలము మీా తర్కమునే వింటిని"

"అతడు న న్నవివేకిగానెంచి నాకు బోధింపనెంచెను. చివర కేమి నిశ్చయమగునో తేల్చుకొనివచ్చి నీకు తెలుప వలయుననియే ని న్నీ అరణ్యమున నా కొరకై వేచియుండ మన్నది."

"తిరిగిరాలేదేమి?"

"ఆయన ఎన్నోసంగతులు చెప్పినాడు. అందువలన ఆలస్యమయినది. కాపాలికుడు నీవు దొరకినదగ్గరనుండి పారి పోయివచ్చువరకుగల సంగతులన్నియు చెప్పెను. ఆ మీాదట కాపాలికుడు యిసుక దిబ్బపైనుండి పడుట, చేతులు విరగుట, ఆతని స్వప్నగాథ మొదలగు విషయములుగూడ చెప్పెను. లుత్ఫున్నిసా చెప్పు ఆ మాటలువిని కపాలకుండల ఉలికిపడినది. ఆమెకు కొంత చిత్తచాంచల్యముగూడ కలిగి నది. లుత్ఫున్నిసా మరల చెప్పదొడగినది. "కాపాలికుని ప్రతిజ్ఞ భవానీదేవి ఆజ్ఞను పరిపాలించుటకై యున్నది. బాహువుల యందు బలము లేకుండుటవలన ఆత డితరుల సహాయము కోరు చున్నాడు. న న్నొక బ్రాహ్మణకుమారునిగ నెంచి నా సహా

యను నాశించి నాకీసంగతులన్నియు చెప్పినాడు. నే నింత వరకు అందుకు సమ్మతించలేదు. ముందుకూడ సమ్మతించ జోను. ఈ అభిప్రాయము తెలుపుటకే నిన్ను కలసికొను మన్నది. ఈ కార్యముకూడ నేను నా స్వార్థముకొరకే చేయుచున్నాను. నేను నీప్రాణములను రక్షించుచున్నాను. నీవుకూడ నాకొకింత సాయము చేయలేవా?"

"నే నేమి చేయవలయును?" అని కపాలకుండల యడిగెను.

"నాకు కూడ ప్రాణదానము చేయుము. అందుకు నీవు భర్తను పరిత్యజింపవలయును."

కపాలకుండల చాలసేపటివరకేమియు సమాధాన మివ్వలేదు. చివరకు "స్వామిని విడనాడి నే నెక్కడకు పోదును."

"చాలా దూరమున పరరాష్ట్రమునకు పొమ్ము. నీకు ధనమిచ్చెదను. దాసదాసీజనముల నిచ్చెదను. ఒకటేమిటి సర్వైశ్వర్యముల నిచ్చెదను. మహారాణివలె జీవించవచ్చును."

మరల కపాలకుండల చాలసేపటివరకు చింతానిమగ్న మైనది. ప్రపంచమంతయు అందు చూచినదిగాని అందెవ్వరును ఆమె కగుపించలేదు. అంతఃకరణమునందు వెదకి చూచినది. అచట నవకుమారుడుగూడ గనుపింపలేదు. అట్టియెడ లుత్పన్నినా మార్గమునకు కంటకమునై నే నేల యుండవలయునని యనుకొన్నది. "ధనధాన్యములు - దాసదాసీజనములు నాకేమియు నవసరము లేదు. నీవు నాకు సహా

యను. జేయుచుంటివో లేదో నాకేమియు తెలియరాలేదు. నేను నీ సుఖమున కేల యాటంకపడవలయును? నీ కోరిక సఫల మగుగాక. రేపటినుండి నా సమాచార మేమియు నీకు తెలియరాదు. నేను వనచరిని. మరల వనచారిణినై చరింతును."

"లుత్ఫున్నిసా చాల ఆశ్చర్యమును బొందినది. ఆమె కపాలకుండల ఇంత తొందరగ తన కోర్కె నంగీక రించునని యనుకొనియుండలేదు. ముగ్ధయై ఆమెతో "చెల్లెలా! నాకు ప్రాణదాన మొసంగితివి. అట్టి నిన్ను అనాథ వలె ఒంటరిగా పోనిచ్చగింపను. రేపటి సూర్యోదయపువేళ చతురమతి యగు నొకదాసిని నీ వెంట పంపెదను. ఆమె నిన్ను వర్ధమానమున నా స్నేహితురాలగు, బహు ప్రధాన యగు మహిళామణివద్దకు గొనిపోవును. అచట నీ ఇచ్ఛాను సారముగ సర్వసౌఖ్యములు నీకు ఆమె సమకూర్చును."

కపాలకుండల - లుత్ఫున్నిసా లిట్లు నిశ్చింతగా మాట్లాడుకొనుచుండిరి కాని వారి ప్రక్కగా పోయిన కాలి బాటపై అల్లంత దూరమునుండి కాపాలికా - నవకుమారులు తమయెడ నెట్టి క్రూరదృష్టిని బరపుచున్నది కానరైరి. వీరి మాట లేమియు దౌర్భాగ్యవశమున వారికి వినరాలేదు. మనుష్యునకు కర్ణ, నయనేంద్రియ జ్ఞానములు రెండును అంత ర్గతములై యున్నయెడల అపుడు వారికి గలుగు సుఖదుఃఖ ములు వృద్ధిబొందునో క్షీణించునో ఎవరు చెప్పగలరు. ముందేమి జరుగనున్నదో అది తెలసికొనుటే దుర్లభము. అస లీ సృష్టి రచనా కౌశల్యమే విచిత్రమైనది.

కపాలకుండల తల విరియబోసికొని ఆ బ్రాహ్మణ కుమారుని ప్రక్కన కూర్చునియుండుట నవకుమారుడు చూచెను నవకుమారు డామెను వివాహమాడువరకు ఆమె ఉన్ముక్తకేశగనే యుండెను. ఆమె నెమ్మదిగ మాట్లాడు నిమిత్త మాతనికి దగ్గరగ కూర్చుని యున్నది. అప్పుడప్పు డామె దీర్ఘకేశము లాతని వీపునబడి ఆతని శిరోరుహము లను దాకుచున్నవి. అది జూచిన నవకుమారునకు మన స్సారాటపడినది. నిరుత్సాహముతో మెల్లన నేలపై జతికిల బడెను. వానిపరిస్థితి గ్రహించి కాపాలికుడు తన నడుమున వ్రేలాడుచున్న టెంకాయబుర్రనుండి యేదో ద్రవపదా ర్థముదీసి "నీరసించి నిరుత్సాహము బొందుచున్నట్లున్నావు. ఇది భవానీదేవి ప్రసాదము. పుచ్చుకొమ్ము. నీకు శక్తి నిచ్చును."అని ఆపాత్రను నవకుమారుని నోటి కందించెను. నవకుమారుడును ఆలోచింపకుండ దానిని త్రావి దాహము దీర్చుకొనెను. పాప మాత డీద్రవము కాపాలికుడు స్వయ ముగా జేసికొను ముడిసారాయమనుసంగతి ఎరుగడు. దానిని త్రాగినంతనే అతని శరీరమున నూతనశక్తి కలిగినది.

అచట వెనుకటి మాదిరినే కపాలకుండలతో లుత్ఫ న్నిసా మెల్లగా మృదుస్వరముతో "సోదరీ! నీ వొనరించు ఉపకారమునకు తగ్గ ప్రత్యుపకారము నేను చేయజాలను. కాని బహుదినములవరకు నిన్ను తలచుకొని సుఖింతును. నే నిదివరకు నీకిచ్చిన యాభరణములన్నియు బీదలకు ధర్మ మిచ్చితివని వినియున్నాను. యిప్పుడు ప్రస్తుతము నావద్ద కూడ నేమియు లేవు. నిన్న నొక దురాలోచనతో నావెంట

నీయుంగరమును తెచ్చి యుంటిని. భగవత్కృపవలన నా పాపకార్యము చేయ నిప్పు డవసరము లేదు. నీ వీ యుంగరము నుంచుకొనుము. ఇది చూచినప్పుడెల్ల నీ ఈ యవన సోదరిని జ్ఞాపకము తెచ్చుకొనవచ్చును. ఒకవేళ నేడు మనస్వామిచూచి యిది ఎక్కడిదని యడిగిన లుత్ఫున్నిసా యిచ్చినదని చెప్పుము." అని తన వ్రేలినున్న వెలలేని ఆ యమూల్యరత్నస్థాపితమగు అంగుళీయకమును తన వ్రేలినుండి తీసి కపాలకుండల చేతియం దుంచెను. నవకుమారు డది చూచి ఉగ్రుడయ్యెను. అతని శరీరము కోపముతో వణకిపోవుచుండెను. కాపాలికు డతనిని పట్టుకొని మరల కొంచెము సారాయి మాతనిచే ద్రావించెను. మదిరాపానమువలని మత్తు తలకెక్కి అతని ప్రకృతి స్వభావమునే మార్చివేయసాగినది. మీదుమిక్కిలి అతనికి ఆమెపై గల ప్రేమానురాగములనుగూడ నిర్మూలన మొనర్పసాగెను.

లుత్ఫున్నిసాకడ శలవుబొంది కపాలకుండల యింటి ముఖమై బయలుదేరినది. లుత్ఫున్నిసాకు కంటబడకుండ కాపాలికా నవకుమారు లామె ననుసరించి వెనుక జనిరి.

## 30

మెల్ల మెల్లన పదవిక్షేపణ జేసికొనుచు కపాలకుండల ఇంటికి పోవుచున్నది. బహుశః ఆమె మనస్సునగల ఏదో దీర్ఘమగు ఆలోచనయే అందుకు కారణమై యుండవచ్చును. లుత్ఫున్నిసావలన విన్న సంగతులవలన ఆమె మనోప్రవృత్తి పూర్తిగా మారిపోయినది. ఆత్మ విసర్జనకుకూడా నిశ్చయించు

కొన్నది. ప్రాణత్యాగ మెవరికొరకు ? లుత్పన్నీనసా నిమిత్తమా ? అందునిమిత్తము కాదు.

కపాలకుండల తాంత్రికులచే పెంచబడిన బిడ్డ. తాంత్రికులు దేవపూజార్థము పరుల ప్రాణములను దేవీ ప్రసాదము పేర నెట్లవలీలగ తీయుగలరో యట్లనే కపాలకుండలయు తన ప్రాణమును త్యజించుటకు తయారుగానుండెను. ఆమె కాపాలికునివలె నేకాగ్రచిత్తముతో భవానీ ప్రసాదము కాంక్షించుట లేదుగాని, దేవీమాహాత్మ్యము విని మనమందా దేవియం దనురాగిణియై శ్రద్ధాభక్తులు కలిగియున్నది. మరియు భైరవీదేవియే సృష్టికర్త్రి, శాసనకారిణి, ముక్తిదాయిని యని నమ్మియున్నది. ఆ దేవికిచ్చు నరబలివలన గల్గు రక్తముతో ప్రాంగణ మంతయు తడిసిపోవుచున్నది. పరుల ఆపత్తును జూచి సహించలేని కపాలకుండల కది జూడ కష్టముగా నుండెడిది కాని భవానీ పూజావిధానమున లోపముండకూడదని యామె తలంచెడిది. జగత్ శాసనకర్త్రి, సుఖదుఃఖ ప్రదాయిని, మోక్షదాయినియైన ఆ దేవి స్వప్నమందగుపడి తన్ను ఆత్మత్యాగినివి గమ్మని ఆదేశ మిచ్చినది. అట్టియెడ కపాలకుండల ఆ దేవి యాజ్ఞ నేల పాలించియుండ లేదు ?

మన మెవరము ప్రాణత్యాగము చేయ సాహసింపలేము. ఇష్టపడము. మోహముచే ఈ ప్రపంచము సుఖమయమని చెప్పుచుందుము. సుఖముగోరి ఆశతో గానుగ ఎద్దువలె సంసారచక్రమునబడి తిరుగుచుందుము. దుఃఖముపట్ల ప్రత్యాశచే గాదు. ఆత్మకర్మ దోషమున నేదేని దుఃఖమే సంప్రా

ప్తించిన, పెద్దపెట్టున ఏడ్చి గోలచేయుదుము. అప్పుడు దుఃఖము - (కష్టము) మానవ ప్రకృతికి భరించదగ్గది గాదని తలంతుము. నీవు - నేను - మనమందరము సుఖ మునే గోరుదుము. అట్టి సుఖమునం దాశ యనెడి త్రాటితో ఈ సంసారమున మనము గట్టబడుచుంటిమి. మన మీా సంసారమునుండి త్రెంచుకొని బయటబడగోరము. ఈ సంసారమునకు ప్రధానమగునది ప్రేమ. కపాలకుండల కట్టి ప్రేమ లభ్యపడలేదు. ఇతర బంధము లేవియూ లేవు ఆ స్థితిలో ఆమెను ఆత్మత్యాగము జేయకుండ ఎవ్వరాపగలరు ?

ఎవని నిరోధింప సాహసింపలేరో అతడు అందరిలోను బలశాలిగా ఎంచబడును ? పర్వత శిఖరాగ్రమునుండి క్రిందుగా ప్రవహించు నదీప్రవాహము నాప నెవరికి శక్యము? అదే ప్రకారము చిత్తచాంచల్యము గలిగిన కపాలకుండల నెవరు స్థిమితపరచగలరు. ఆమె తన శరీరము నేల పరాత్పరికి సమర్పింపకూడదని వితర్కించుకున్నది. ప్రపంచమునందు తన కేసంబంధము లేకున్నను, పంచభూతాత్మకమైన సంబం ధము తన కున్నదని తనలో తలపోయసాగినది.

కపాలకుండల ఆలోచనాయత్తయై తలవంచుకుని త్రోవను నడువసాగినది. మన మెప్పుడు తీవ్రముగ ఆలోచనా నిమగ్నమై యుందుమో యపుడు బాహ్యదృశ్యములు శూన్య ములుగ నుండి, మనోదృష్టిని తలపుననున్న పదార్థములు ప్రత్యక్షముగ నున్నట్లగుపించుచుండును. కపాలకుండల పరి స్థితియు యిప్పు డట్లే యున్నది.

ఉన్నట్లుండి గగనమున నుండి "కుమారీ! నేను నీకు దారి చూపించుచున్నాను." అని వినవచ్చినది. ఆమె ఆక సమువంక చూడ నవనీరదనిందితమూర్తియైన భైరవీ మూర్తి యగుపించినట్లయ్యెను. ఆ దేవి కంఠమున వేలాడు నరముండమాలనుండి రక్తము స్రవించుచున్నది. నడుము చుట్టును ఖండితనరహస్తములు వేలాడగట్టబడి యున్నవి. వామహస్తమున కపాలమును, ఒంటినిండ రక్తము గలిగి యున్నది. ఆమె నేత్రములు ఉజ్వలజ్వాలావిభాసితములుగ నుండెను. ఆ మూర్తి తన్ను వామహస్తమున పిలుచు చున్న ట్లగుపించినది.

కపాలకుండల పైకి చూచుచు నడువసాగినది. భైరవీ మూర్తియు ఆకాశమార్గమున తనకు ముందుగ నడచుచున్న ట్లగుపించుచున్నది. మేఘమాలికల మరుగునబోవుచు అప్పు డప్పుడు ఆ దేవి స్వరూపము స్పష్టముగ గనబడుచున్నది. కపాలకుండల అటులనే పైకి జూచుచు నడచుచున్నది.

కాపాలికా - నవకుమారులు ఇట్టిదేమియు జూచి యుండలేదు. సురాపానమత్తతవలన నవకుమారుడు కపాల కుండల మందగమనము జూచి సహించలేక కాపాలికుని జూచి "కాపాలికా!"యని బిలచెను.

కాపాలికుడు "ఏమి?"యని యడిగెను.

"పానీయం దేహిమే!"

కాపాలికుడు మరల కొంత మద్యమును నవకుమారున కిచ్చెను.

"ఇక ఆలస్యమెందులకు?"అని నవకుమారు డడిగెను.

"ఆలస్యమేమి ?"

అంత నవకుమారుడు భయంకరస్వరముతో "కపాల కుండలా"యని అరచెను. ఆపిలుపు విని కపాలకుండల ఉలికి పడినది. ఇతరులెవ్వరు తన్నాపేరున పిలువరు. ఆమె వెను దిరిగి వారి ముఖమై నిలుచున్నది. కాపాలికా - నవకుమారు లామెదగ్గరగవచ్చి నిలుచుండిరి. మొదట వారి నామె గుర్తిం చక "ఎవరు మీరు ? యమదూతలా ?"యని అడిగినది. ఆ మరుక్షణముననే వారిని గుర్తించి "లేదు. కాదు. తండ్రీ మీరునన్ను బలీయగోరివచ్చితిరా ?" యని యడిగినది.

నవకుమారుడు పరవశుడై కపాలకుండల చేతిని పట్టు కొనెను. కాపాలికుడు కరుణాపూరిత స్వరమున "బిడ్డా! మావెంటరమ్ము"అని స్మశానమువైపుగా పోవు దారిని నడువసాగెను.

కపాలకుండల మరల ఆకాశముపైకి జూచినది. అచట భైరవీమూర్తి వికారస్వరూపము కనుపించినది. ఆ రణరంగిణి వికారముగ నవ్వుచున్నది. కపాలకుండల అదృష్ట విమూఢిత వలె కాపాలికుని అనుసరించి పోవుచున్నది. నవకుమారు డింకనూ ఆమె నట్లే గట్టిగా పట్టుకొని వెంట తీసికొని పోసాగెను.

## 3

చంద్రు డస్తమించెను. ప్రపంచమంతట అంధ కారము వ్యాపించినది కపాలకుండలను కాపాలికుడు తాను నిర్మించుకున్న పూజాస్థానమునకు గొనిపోయెను. అది గంగ

ఒడ్డునగల ఎత్తైన యిసుకభూమి. దానిఎదుట మరొక విశా లమైన భూమిగలదు. అదే స్మశానము. ఆప్రదేశముల రెండింటికి నడుమగల లోయయందు ఎల్లకాలము ప్రవాహ మొకటి పారుచుండును. స్మశానమున కా ప్రక్కన గంగ ప్రవహించుచున్నది. అచట నచట నా స్మశా నభూమి చాల ఎత్తుగా నుండినది. క్రింద గంగా నది అగాధముగ వేగముతో ప్రవహించుచున్నది. సము ద్రపు పాటుసమయమున నీ రింకను ఎక్కువగ నుండును. తుఫాను గాలివలన చెలరేగిన తరంగములు వచ్చి ఆ స్మశాన భూమిని తాకి కొట్టుకొనుటవలన అప్పుడప్పుడు ఆ ఒడ్డువిరిగి యిసుకపెల్లలా అగాధ జలమున బడుచుండును. పూజా ప్రదే శమున దీప మేమియు వెలుగుటలేదు. కేవల మొక కాష్ఠము మాత్రము మండుచున్నది. ఆ గుడ్డివెలుతురులో స్మశాన మంతయు భయానకముగ గనిపించుచున్నది. హోమమును ప్రక్కనే పూజాద్రవ్యములు, బలినిచ్చుటకు కావలసిన సరం జామ నంతయు నేర్పాటు చేయబడియున్నది. నదీగర్భ మంతయు అంధకార బంధురమై యున్నది. పెనుగాలి సాగి నదీగర్భమున విపరీతముగ అలలు చెలరేగి రొదబెట్టుచున్నవి. స్మశానమునందు దిరుగు శవభక్షణజేయు జంతువు లొకటి రెండు అడప తడప కూయు కూతలు వినవచ్చుచున్నవి.

కాపాలికుడు నవకుమారుని- కపాలకుండలను నిర్ణయ స్థానముల కూర్చుండజేసి తాను పూజావిధానమునందు నిమగ్నుడయ్యెను. కూర్చుండబోవుముందు నవకుమారుని తో కపాలకుండలను స్నానము చేయించి తీసికొనిరమ్మని

చెప్పెను. నవకుమారు డామెచేయి పుచ్చుకొని స్నానము చేయించగోరి స్మశానభూమిమీదుగా నదీతీరమునకు బోవు చుండెను. నడచునప్పు డతని పదముల క్రిందబడి ఎముకలు విరిగిన శబ్దమగుచున్నది. అడప తడప అతని కాలికి నీటి ముంతలు తాకుచున్నవి. ఒకచోట నొక స్త్రీ శవముగూడ పడియున్నది. ఆ దిక్కుమాలిదాని కెవ్వరును సంస్కారమైన చేసియుండలేదు. నవకుమారు డా శవమును ద్రొక్కుచూ పోయెను కపాలకుండల దాటిపోయెను. దాపున నేవో జంతువు లా శవభక్షణకై ఆరాటపడి తిరుగుచున్నవి. వా రిద్దరిని జూచి అవి బిగ్గరగా అరువసాగినవి. కొన్ని వారి మీదకుకూడా వచ్చినవి. మొత్తముమీద అన్నియు పారి పోయినవి. కపాలకుండల తనచేయి పట్టుకున్న నవకుమారుని చేయి వణకుచుండెనని తెలసికొన్నది. ఆమె భయపడుట లేదు.

కపాలకుండల "స్వామీ! భయమగుచున్నదా ?" అని నవకుమారు నడిగినది. నవకుమారునికి క్రమముగా సారాయి త్రావిన మత్తు వదలుచున్నది. అతడు "నాకు భయమా ! మృణ్మయీ ?" అనెను.

"కానియెడ వణకుచున్నారేల ?" అని రమణీ సహజ మగు మృదుస్వరమున బలికినది. స్త్రీ హృదయ మెపుడు పరుల కష్టములనుజూచి సహింపజాలదో యపు డట్టి స్వరముననే బలుకుట లోక సహజము. మరణమాసన్న మగుచున్న సంగతి తెలసిన యామె యట్టి జాలిగొలుపు మృదుస్వరమున బలుకు నని ఎవరు తలచెదరు !

"భయపడుటలేదు. ఏడ్వదలచినను వచ్చుటలేదు. కాని క్రోధమువలన ఒడలు గంపరమెత్తుచున్నది" అని నవకుమారుడనెను.

"ఎందుల కేడ్చెదరు?" మరల వెనుకటి స్వరముననే అడిగినది.

"ఎందులకా? మృణ్మయీ! నీకెట్లు తెలియును. నీ వెప్పుడును సౌందర్యమును జూచి ఉన్మాదినివి గాలేదు." ఇట్లు చెప్పుచున్న నవకుమారుని కంఠము యాతనతో కుంచించుకొని పోయినది. "నీవెన్నడైన నీ ప్రాణమును స్వయముగా తీసికొనుటకు స్మశానమున కిట్లు వచ్చియుంటివా? మృణ్మయీ!" పెద్దపెట్టున నేడ్చుచు అతడు కపాలకుండల పాదములపై బడెను.

"మృణ్మయీ! కపాలకుండలా! నా ప్రాణములను రక్షించుము. నీ కాళ్ళముందు పడియున్నాను. 'నేను అవిశ్వాసినిని గానని' ఒక్కమాట చెప్పుము. నిన్ను నా హృదయమునకు హత్తుకొని యింటికి తీసికొని పోయెదను."

కపాలకుండల రెండుచేతుల అతని లేవనెత్తి "మీరు నన్నా విషయ మడుగవద్దు" అని మృదుస్వరమున అన్నది. వారీ మాట లనుకొనుచు నదియొడ్డువరకు వచ్చి చేరిరి. కపాలకుండల ముందుండి నదివైపుకు వీపు జూపియున్నది. ఆమె ఒడ్డున నున్నది. అవతల నదీ ప్రవాహ మున్నది. సముద్రము పోటు ప్రారంభమగుటవలన నదీముఖద్వారమున ప్రారంభమయిన యలల విసరు ఇచ్చటకుకూడ దగులుచున్నది. కపాలకుండల ఒడ్డుచివరవరకు పోయి "మీరు నన్నా విషయ మడుగవద్దని" జాలిగా పలికినది.

నవకుమారుడు పిచ్చవానివలె "నేను చైతన్యమును కోలుపోయితిని, నిన్నేమని ప్రార్థించవలెనో చెప్పుము; మృణ్మయీ! చెప్పుము; చెప్పి నన్ను రక్షించుము. నా వెంట యింటికి రమ్ము." అనెను.

కపాలకుండల "మీరు దేనిని చెప్పుమని కోరుచున్నారో చెప్పెదను. మీరు నేడు నా అండ నెవరిని జూచినారో ఆమె పద్మావతి. నే నెన్నటికినీ అవిశ్వాసినిని గాను. విషయమంతయు జెప్పెదనుగాని, నే నింటి కింక తిరిగిరాను. భవానీదేవి పాదములముందు ప్రాణత్యాగము చేయ నిశ్చయించుకొని వచ్చితిని. స్వామీ! మీ రింటికి మరలి పొండు. నే నిచట మరణింతును. నాకై మీరు విచారించవలదు" అనెను.

"వలదు; మృణ్మయీ! అటుల చేయవలదు అని ఆమెను తన హృదయమునకు జేర్చుకొనవలయునని తన రెండుచేతులు ముందునకు జాచెను. కాని కపాలకుండల నతడు దరిజేర్చుకొనలేకపోయెను. కారణమేమన, వసంత వాయుతాడనమువలన చెలరేగిన పెద్ద తరంగమొకటి కపాల కుండల నిలచియున్న ఒడ్డును తీవ్రముగ తాక ఒడ్డు విరిగి కపాలకుండలతో బాటు పెద్దశబ్దముతో ఆ అగాధమున బడిపోయెను.

నవకుమారు డా భీషణధ్వనిని వినెను. కపాలకుండల నీటియందు అదృశ్యయగుట జూచినాడు. వెంటనే తానుగూడ చెంగున ఆ ప్రవాహమందు దూకెను. నవకుమారున కీదుట

యందు అనుభవము గలదు. తనశక్తినంతయు వినియోగించి కపాలకుండలకై నీటియందు వెతకినాడు. ఆతనికి కపాల కుండల దొరుకలేదు. అతడుగూడ నీటినుండి బయటకు రాలేకపోయెను.

తుదకా వసంతవాయుపీడితగంగాప్రవాహవీచికల యందు మునుగుచూ, తేలుచూ కపాలకుండలా-నవకుమారు లేమైపోయిరో?

ఆసంగతి 'మృణ్మయి' అన్న నవల చదివిన తెలియగలదు.



**KAPALA KUNDALA** (Bankim Babu's Novel) **Re. 1-50 nP.**

## సుప్రసిద్ధ నవలలు, కథలు:

| | | రు. న.పై. |
|---|---|---|
| 1. కపాల కుండల | (బంకింబాబు నవల) | 1-50 |
| 2. దాగుడు మూతలు | (రవీంద్రుని కథలు) | 1 |
| 3. మధుప మంజరి | (కథా గుచ్ఛము) | 0 |
| 4. అంతరాత్మ | (శ్రీవిశ్వనాథ సత్యనారాయణ) | 1 |
| 5. ధన్యకైలాసం | ,, (నాటకం) | 1 |
| 6. స్వయంసిద్ధ | (మణిలాల్ బంద్యోపాధ్యాయ) (మొదటి భాగము) | 3 50 |
| 7. స్వయంసిద్ధ | (రెండవ భాగము) | 4-50 |
| 8. ప్రియబాంధవి | (ప్రబోధకుమార్ సన్యాల్) | 3-00 |
| 9. బాల్యమిత్రుడు | (ప్రభాతకుమార్ ముఖర్జి) | 1-00 |
| 10. మమత | (ప్రేమ్‌చంద్) | 1-50 |
| 11. గళ్ళచీర | (కుమారరాఘవశాస్త్రి) | 1-00 |
| 12. సాహసి గోపి | (పిల్లల నవల) | 1-00 |

కె. ఎస్. ఆర్. అండ్ సన్సు,

పబ్లిషర్సు అండ్ బుక్ సెల్లర్సు,

బకింగ్‌హాంపేట, P. O. విజయవాడ-2.



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్ |
| | పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA106B133 |
| పుస్తకం పేరు | కోపాల కుండలు |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 145 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | 1,2,3 |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Susmitha |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | Ruksana |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | no |
| పరిస్థితి | Good |